# శ్రీకృష్ణలీలలు -1

## బమ్మెఱ పోతనామాత్య ప్రణీతం

సంకలనం -  భాగవత గణనాధ్యాయి



సౌజన్యం:  telugubhagavtam.org

జనవరి - 2022

నారాయణ శతకం:

మత్తేభము.

ధ**ర** సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై

ప**ర**మామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాగారమై

సి**రి** భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై

వ**రు**సన్ నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా!

# శ్రీ కృష్ణలీలలు -1

**ప్రస్తావన :-**

నారదమహర్షి ప్రేరణతో, వ్యాసభగవానులవారు భక్తిరస ప్రధానమైన భాగవత పురాణం రచించారు. శ్రీరామచంద్ర ప్రభువు ప్రేరణతో మన సహజ కవి బమ్మెఱ పోతనామాత్యుల వారు ఆంధ్రీకరించారు. తెలుగుభాగవతం.ఆర్గ్ . ద్వారా అంతర్జాలంలో అందుబాటులో ఉంచబడింది. ఈ పురాణం భక్తి, జ్ఞాన, విజ్ఞాన, వైరాగ్యాదుల సమ్మేళనం.

పురాణాలు అన్నింటిలోనూ శ్రేష్ఠమైనది, పరమ పవిత్రమైనది ఈ భాగవతం. అందులో శ్రీకృష్ణపరబ్రహ్మ గురించి విస్తారంగా వివరించారు కనుక దశమ స్కంధం శ్రేష్టతమం అని విజ్ఞులు చెప్తారు. ఇందులో, శ్రీకృష్ణులవారు ఏవయసులో ఏమి చేసారో కూడా గుర్తించ వచ్చు. అప్పుడు, వారి మానవాతీత దైవిక శక్తి మరికొంత విశదమౌతుంది.

ఎంత మంచి పుస్తకమైనా ఒకటి రెండు సార్లు చదివాకా, మరల మరల.. రోజు చదవా లనిపించదు. అదే భగవంతుని లీలలు ఉంటే అబ్బే విసుగే రాదు. అవును అందుకే లోకంలో నిత్యం భాగవతం పారయణ చేసేవారు ఉన్నారు. భగవద్గీతను పఠించేవారు ఉన్నారు.. వారెవరికీ విసు గనిపించదు. పైగా రోజు క్రొత్త అర్థాలు, తృప్తి కలుగు తుంటాయి, పెరుగుతుంటాయి. అంటే వాటిలో ఏదో విశేషం ఉండాలి కదా.

ముక్తి ప్రదాత శ్రీకృష్ణుడు మానవునిగా జన్మించాడు, పెరిగాడు. మానవులకు అసాధ్యమైన కృత్యాలు అనేకం చేసాడు. అవతారమే అద్భుతం. పూర్ణావతారం. రాజుల కుంటుంబంలో పుట్టినా చెరసాలలో పుట్టాడు. గంటల్లో అంత పెద్ద నది యమునను దాటాడు. శిశువుగా తలస్నానం చేయించు

కుంటుంటే అంత గంభీరమైన దివ్యతత్వనిర్ణయం అలవోకగా చెప్పిన తీరు పరమాద్భుతం.

పొత్తిళ్ళల్లో శిశువుట రక్కసి పూతన సంహార మట. ఆశ్చర్యకర మైన భగవతస్పర్శ మహాత్యం వర్ణనట. ఐనామనకి బుల్లికృష్ణుడే. అందుకే, బోర్లా పడితే పేరంటం వంటివి సర్వం పిల్లలకు జేసే వేడుకలన్నీ చేయించుకున్నాడు (రు). నెలల పిల్లాడుట తన్నుతన్నితే శకటం గాల్లోకి ఎగిరిపడి విరిగిపోయిందిట. అది రాక్షసబండిట. ఐనా చంటిపిల్లాడేమనకు. ఇంకానడకరాలేదు సుడిగాలి రాక్షసుడి సంహారం. మహా యోగసాధకులకు కష్ట సాధ్య మైన అతిబల (విపరీతంగా బరువు పెరుగుట) విద్య ప్రయోగించాడు.

నామకరణాలు చేసిన గర్గమహర్షికి రహస్యం తెలుసు అనుకుంటాను. గర్గ భాగవతం చదువుతే ఇది అనిపిస్తుంది. నామకరణం అయ్యాక ఏడాదిలోపు క్రీడావిశేషాలు, హరిహరాభేదము చూపుట అమృతతుల్యాలు. అనితర సాధ్యాలు, మహాప్రభావవంతాలు. అందుకే ఎన్నిసార్లుచదివినా తనివితీరదు.

భాగవతం ఎంత దివ్యమైనది కనుకనే ఆ స్ఫూర్తితో ఎన్నెన్నో కళారూపాలు, పాటలు, సినిమాలు, నాటకాలు, హరికథలు, బుఱ్ఱకథలు, ఒగ్గుకథలు, తోలుబొమ్మలాటలు... వచ్చాయి.

ఆ శ్రీకృషులవారి బాల్య లీలలు సదరు తెలుగుభాగవతం.ఆర్గ్ , నుండి చేసిన సంకలన మిది... చక్కగా సాధన చేసుకుందాం...

చదువుకుందాం భాగవతం .. బాగుపడదాం మనమందరం...

## ప్రార్థన

10.1-1-క.

**శ్రీకంఠచాప ఖండన!**

**పాకారిప్రముఖ వినుత భండన! విలస**

**త్కాకుత్థ్సవంశమండన!**

**రాకేందు యశోవిశాల! రామనృపాలా!**

**టీక:-** శ్రీకంఠచాపఖండన = శ్రీరామ {శ్రీకంఠ చాప ఖండనుడు - శ్రీకంఠుని (శోభాకర కంఠుడు యైన శివుని) చాప (విల్లును) ఖండనుడు (విరిచినవాడు), రాముడు}; పాకారిప్రముఖ వినుత భండన = శ్రీరామ {పాకారి ప్రముఖ వినుత భండనుడు - (పాకాసురుని శత్రువైన ఇంద్రుడు) మున్నగువారి చేత వినుత (పొగడబడిన) భండన (యుద్ధము కలవాడు), రాముడు}; విలసత్కాకుత్థ్స వంశ మండన = శ్రీరామ {విలసత్కాకుత్థ్స వంశ మండనుడు - విలసత్ (ప్రసిద్ధి కెక్కిన) కాకుత్థ్సవంశ (కకుత్థ్స మహరాజ వంశమునకు) మండనుడు (అలంకారమైనవాడు), రాముడు}; రాకేందు యశోవిశాల = శ్రీరామ {రాకేందు యశోవిశాలుడు - రాకేందు (నిండు పున్నమి చంద్రుని) వంటి యశః (కీర్తి) విశాలుడు (విరివిగా కలవాడు), రాముడు}; రామ = రాముడు అనెడి {నిండుపున్నమి చంద్రుని పదహారు కళలు - 1అమృత 2మానద 3పూష 4తుష్టి 5పుష్టి 6రతి 7ధృతి 8శశిని 9చంద్రిక 10కాంతి 11జ్యోత్స్న 12శ్రీ 13ప్రీతి 14అంగద 15పూర్ణ 16పూర్ణామృత}; నృపాల = రాజా.

**భావము:-** శ్రీరామచంద్ర ప్రభు! నీవు క్షీరసాగరమథన సమయంలో పుట్టిన హాలాహలమును కంఠమున ధరించుట ద్వారా లోకాలు సమస్తమునకు శోభను అనుగ్రహించిన శివుని ధనుస్సు విరిచిన మొనగాడవు. ఇంద్రుడు మొదలైన దేవతలు సైతం కీర్తించేలా యుద్ధం చేసిన వాడవు. ప్రసిద్ధమైన కాకుత్థ్స

వంశానికి అలంకారమైన వాడవు. నిండు పదహారు కళల పూర్ణచంద్రుని లాంటి కీర్తి మెండుగా వ్యాపించిన వాడవు. ప్రజలకి ఆనందం పంచే మహారాజువి.

శ్రీకృష్ణ శతకము 63)



నీవేతల్లివి దండ్రివి

నీవే నా తోడునీడ నీవే సఖుడా

నీవేగురుడవు దైవము

నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా!

**జలక మాడించుట**

10.1-189-తే.

పాపనికి నూనెఁ దలయంటి, పసుపుఁ బూసి,

బోరుకాడించి, "హరిరక్ష వొ"మ్మటంచు

జలము లొక కొన్ని చుట్టి రాఁజల్లి, తొట్ల

నునిచి, దీవించి, పాడి ర య్యువిద లెల్ల.

టీక:- పాపని = బాలుని; కిన్ = కి; నూనెన్ = చమురు పెట్టి; తలయంటి = అభ్యంగన స్నానము చేయించి; పసుపు = పసుపును; పూసి = రాసి; బోరుకాడించి = పిల్లవానికి బోరున నీళ్ళు వోసి; హరి = శ్రీహరే; రక్ష = అండ; వొమ్ము = కావలెను; అంచున్ = అనుచు; జలములు = నీళ్ళు; ఒకకొన్ని = కొంచెము; చుట్టి = చూట్టూరాతిప్పి; రాన్ = వచ్చునట్లు; జల్లి = చల్లి; తొట్లన్ = ఉయ్యాల యందు; ఉనిచి = ఉంచి, పడుకోబెట్టి; దీవించి = ఆశీర్వదించి; పాడిరి = పాటలు పాడిరి; ఉవిదలు = పడతులు; ఎల్లన్ = అందరు.

భావము:- గోపికలు అందరూ కలసి ఆ బాలుడి తలకు నూనె అంటి శరీరానికి పసుపు రాసారు. శుభ్రంగా స్నానం చేయించారు. చివరగా బోరున నీళ్ళు పోసి, “ఇదే

నీకు శ్రీరామరక్ష” అని కొన్ని నీళ్ళు చుట్టూ త్రిప్పి చల్లారు. ఊయల తొట్టెలలో పడుకోబెట్టి దీవించారు; ఇలా జోల పాటలు పాడేరు.



10.1-190-క.

**"జోజో కమలదళేక్షణ!**

**జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా!**

**జోజో పల్లవకరపద!**

**జోజో పూర్ణేందువదన! జోజో"యనుచున్.**

టీక:- జోజో = బజ్జో నాయనా బజ్జో; కమల = తామర; దళ = రేకులవంటి; ఈక్షణ = కన్నులు కలవాడా; జోజో = బజ్జో నాయనా బజ్జో; మృగరాజ = సింహము వంటి; మధ్య = నడుము కలవాడా; జోజో = బజ్జో నాయనా బజ్జో; కృష్ణా = నల్లనయ్యా {కృష్ణుడు - సృష్టి స్థితి లయ తిరోదాన అనుగ్రహములు అనెడి పంచకృత్యములు చేయువాడు, శ్రీకృష్ణుడు}; జోజో = బజ్జో నాయనా బజ్జో; పల్లవ = చిగురుటాకులవంటి; కర = చేతులు; పద = పాదములు కలవాడా; జోజో = బజ్జో నాయనా బజ్జో; పూర్ణ = నిండు; ఇందు = చంద్రుని వంటి; వదన = మోము కలవాడా; జోజో = బజ్జో నాయనా బజ్జో; అనుచున్ = అనుచు.

భావము:- గోపికలు చిన్నికృష్ణునికి శుభ్రంగా స్నానం చేయించి, నిద్రపుచ్చుతు – "జోజో కమలదళేక్షణ! జోజో మృగరాజమధ్య! జోజో కృష్ణా! జోజో పల్లవకరపద! జోజో పూర్ణేందువదన! జోజో"అంటు జోలపాటలు పాడారు.

10.1-191-వ.

ఇ వ్విధంబున.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగా. భావము:- ఈ విధంగా. . . .

10.1-192-క.

పలు తోయంబులు జగములఁ

బలు తోయములందు ముంచి, భాసిల్లెడి యా

పలుతోయగాఁడు, వల్లవ

లలనా కరతోయములఁ జెలంగుచుఁ దడియున్.

టీక:- పలు = అనేక; తోయంబులున్ = మారులు; జగములన్ = భువనములను; పలు = అధికములైన (ప్రళయ); తోయములు = జలముల (సముద్రముల); అందున్ = లో; ముంచి = ముంచేసి; భాసిల్లెడు = ప్రకాశించెడి; ఆ = ప్రసిద్ధుడైనట్టి; పలు = బహు; తోయగాడు = విధములు కలవాడు; వల్లవ = గోపికా; లలనా = స్త్రీల; కర = చేతులతో పోయబడెడి; తోయములన్ = నీళ్ళలో; చెలంగుచున్ = చెలరేగుచు; తడియున్ = తడిసెను.

భావము:- ఎన్నెన్నో ప్రళయసమయాలలో ఎన్నోమార్లు జగత్తులను నీటిలో ముంచివేసి తాను ప్రకాశిస్తూ ఉండే ఆ మాయలాడు గోపికల చేతుల్లో జలకాలాడుతూ కేరింతలు కొడుతూ ఆడుకున్నాడు.

10.1-193-క.

లోకములు నిదుర వోవఁగ

జోకొట్టుచు, నిదురవోని సుభఁగుడు, రమణుల్

జోకొట్టి పాడ, నిదురం

గైకొను క్రియ నూరకుండెఁ గను దెఱవకయున్.

టీక:- లోకములున్ = ఎల్లలోకులను; నిదురవోవగన్ = నిద్రించేలాగ; జోకొట్టుచున్ = నిద్రపుచ్చుతు; నిదురవోని = ఏమరుపాటు పొందని; సుభగుడు = అందగాడు; రమణుల్ = సుందరీమణులు; జోకొట్టి = నిద్రపుచ్చి; పాడన్ = పాటలు పాడగా; నిదురన్ = నిద్రను; కైకొను = స్వీకరించుతున్న; క్రియన్ = అనిపించునట్లు; ఊరకుండెన్ = కదలక మెదలక ఉండెను; కను = కళ్ళు; తెఱవకయున్ = తెరవకుండా.

భావము:- లోకాలన్నింటినీ జోకొట్టి నిదురపుచ్చుతూ తాను మాత్రం మెలకువగా ఉండే ఆ అందగాడు, గోపికలు జోకొడుతూ ఉంటే నిద్రపోయినట్లు కనులు తెరవకుండా కదలకుండా పడుకున్నాడు.

10.1-194-సీ.

ఏ బాము లెఱుగక యేపారు మేటికిఁ-

బసుల కాపరియింటఁ బాము గలిగె;

నే కర్మములు లేక యెనయు నెక్కటికిని-

జాత కర్మంబులు సంభవించె;

నే తల్లి చనుఁబాలు నెఱుఁగని ప్రోడ, య-

శోద చన్నుల పాల చొరవ నెఱిఁగె;

నే హాని వృద్ధులు నెఱుఁగని బ్రహ్మంబు-

పొదిఁగిటిలో వృద్ధిఁ బొందఁ జొచ్చె;

10.1-194.1-తే.

నే తపములనైన నెలమిఁ బండనిపంట

వల్లవీ జనముల వాడఁ బండె;

నే చదువుల నైన నిట్టిట్టి దనరాని

యర్థ మవయవముల నంద మందె.

**టీక:-** ఏ = ఎట్టి; బాములున్ = పుట్టుకలు; ఎఱుగక = ఎప్పుడు లేకుండగ; ఏపారు = అతిశయించెడి; మేటి = గొప్పవాని; కిన్ = కి; పసులకాపరి = ఆవులుకాసే గొల్లల; ఇంటన్ = ఇంట్లో; బాము = పుట్టుట; కలిగెన్ = సంభవించెను; ఏ = ఏవిధమైన; కర్మములు = కర్మలు; లేక = అంటక; ఎనయు = పొందిక కలిగిన; ఎక్కటి = ఒంటరి; కినిన్ = కి; జాతకర్మంబులు = పుట్టినప్పుడు చేయుక్రియ; సంభవించెన్ = పొందెను; ఏ = ఏవిధమైన; తల్లి = మాతృమూర్తి; చను = స్తనముల; పాలున్ = క్షీరమును; ఎఱుగని = తెలియని; ప్రోడ = నిపుణుడు; యశోద = యశోద యొక్క; చన్నుల = స్తనముల; పాలన్ = క్షీరమునందు; చొరవన్ = ఆసక్తిని; ఎఱిగెన్ = చూసెను; ఏ = ఎటువంటి; హాని = కీడు; వృద్ధులున్ = మేలు; ఎఱుగని = ఏమాత్రము లేని; బ్రహ్మంబు = పరబ్రహ్మ; పొదిగిటి = ఒడి; లోన్ = అందు; వృద్ధిన్ = వర్థిల్లుటను; పొందజొచ్చెన్ = పొందసాగెను; ఏ = ఎట్టి.
తపములన్ = తపస్సులను; ఐనన్ = అయినప్పటికి; ఎలమిన్ = వికసించి; పండని = ఫలించని; పంట = పరమపదము; వల్లవీ = గోపికాస్త్రీ; జనముల = జనముల యొక్క; వాడన్ = పల్లెలో; పండెన్ = పండుకొనెను, ఫలించెను; ఏ = ఎటువంటి; చదువులన్ = విద్యల వలన; ఐనన్ = అయినప్పటికి; ఇట్టిట్టిది = అలాంటిది ఇలాంటిది; అనరాని = అని చెప్ప సాధ్యము కాని; అర్థము = పదార్థము; అవయవములన్ = కరచరణాదు లందు; అందము = అందమును; అందెన్ = పొందెను.

**భావము:-** దుఖాలు అనేవి ఎరుగని మహాత్మునికి పశువుల కాపరుల ఇంట పుట్టి బాధలలో పెరుగవలసిన స్థితి వచ్చింది; కర్మలనేవి లేకుండా తానొక్కడే ప్రకాశించే విష్ణువు జాతకర్మలు చేయించుకున్నాడు; తానే జగత్తుకు తల్లితండ్రి అయి తల్లిపాలు ఎరుగనివాడు నేడు యశోదాదేవి చనుబాల రుచి మరిగాడు. పెరుగుట తరుగుట అనేవి యెరుగని పరబ్రహ్మము ఈనాడు యశోద ఒడిలో పెరగసాగాడు. ఎన్ని తపస్సులు చేసినా పండని బంగారుపంట నేడు గోపకుల ప్రేపల్లె వాడలో కన్నులపండువగా పండింది. ఎన్ని చదువులు శాస్త్రాలు చదువుకున్నా ఇలా ఉంటుంది అని తెలియరాని ఆ పరమార్థం అందాలుచిందే బాలుని అవయవా లన్నింటిలోనూ అభివ్యక్తం కాసాగింది.

10.1-195-మ.

చెయువుల్ జేయుతఱిన్ విధాతకరణిం జెన్నొందు, సంతోష దృ
ష్టి యుతుండై నగుచున్ జనార్దనుని మాడ్కిం బోల్చు, రోషించి యు
న్న యెడన్ రుద్రునిభంగి నొప్పును, సుఖానందంబునం బొంది త
న్మయుడై బ్రహ్మముభాతి బాలుఁ డమరు న్బాహుళ్య బాల్యంబునన్.

టీక:- చెయువుల్ = పాకుట పలుకుటాది చేష్టలు; చేయు = చేయ మొదలిడెడి; తఱిన్ = సమయము నందు; విధాత = బ్రహ్మదేవుని; కరణిన్ = విధముగా; చెన్నొందున్ = ఒప్పును; సంతోష = ఆనందపు; దృష్టి = చూపులతో; యుతుండు = కూడినవాడు; ఐ = అయ్యి; నగుచున్ = నవ్వుతూ; జనార్దనుని = విష్ణుమూర్తి; మాడ్కిన్ = వలె; పోల్చున్ = పోలియుండును; రోషించి = కోపగించి; ఉన్న = ఉన్నట్టి; ఎడన్ = సమయము నందు; రుద్రుని = పరమశివుని; భంగిన్ = వలె; ఒప్పును = చక్కగా ఉండును; సుఖ = సుఖములవలన; ఆనందంబున్ = సంతోషమును; పొంది = పొంది; తన్మయుడు = పరవశము పొందినవాడు; ఐ = అయ్యి; బ్రహ్మము = పరబ్రహ్మ; భాతిన్ = వలె; బాలుడు = పిల్లవాడు; అమరున్ = చక్కగా అమరి ఉండును; బాహుళ్య = గొప్ప; బాల్యంబునన్ = బాల్యావస్థ అందు.

భావము:- ఆ చిన్నికృష్ణుడు బాల్యచేష్టలు చేస్తూ క్రొత్త క్రొత్త లీలలు ప్రకటించే టప్పుడు సృష్టికర్త యైన బ్రహ్మదేవుడివలె ప్రకాశిస్తాడు. సంతోషం నిండిన చూపులతో ఉన్నప్పుడు విష్ణువువలె కనిపిస్తాడు. కోపంవచ్చి రోషం తెచ్చుకున్న సమయంలో రుద్రునివలె భయం గొలుపుతాడు. ఆనందంతో తన్మయుడు అయినప్పుడు పరబ్రహ్మములాగా గోచరిస్తాడు. ఈవిధంగా ఎన్నో రీతులతో బాలకృష్ణుని బాల్యం గడుస్తున్నది.

10.1-196-వ.

అ య్యవసరంబున

టీక:- అయ్యవసరంబునన్ = అప్పుడు. భావము:- అప్పుడు . . .

10.1-197-ఆ.

కొడుకుఁ గన్న వేడ్కఁ గొనసాగ రోహిణిఁ

జీరఁబంచి, చిత్రచేలములను

మండనముల నిచ్చి, మన్నించె, నందుఁ డా

యంబుజాక్షి ప్రీతయై చరించె.

**టీక:-** కొడుకున్ = పుత్రుని; కన్న = ప్రసవించిన; వేడ్కన్ = సంతోషము; కొనసాగన్ = కలకాలము ఉండుటకు; రోహిణిన్ = రోహిణీదేవిని; చీరబంచి = పిలిపించి; చిత్ర = నానావిధ రంగులతో చిత్రించిన; చేలములన్ = వస్త్రములను; మండనములన్ = ఆభరణములను; ఇచ్చి = బహూకరించి; మన్నించెన్ = గౌరవించెను; నందుండు = నందుడు; ఆ = ఆ; అంబుజాక్షి = పద్మాక్షి, పడతి; ప్రీత = సంతోషించినది; ఐ = అయ్యి; చరించెన్ = వర్తించెను.

**భావము:-** నందుడు తాను కొడుకును కన్న సంబరంలో రోహిణీదేవిని పిలిపించాడు రంగురంగుల చీరలను ఆభరణాలను బహుకరించి గౌరవించినాడు. ఆమె చాలా సంతోషించింది.

## పూతన వ్రేపల్లె కొచ్చుట

10.1-212-సీ.

కంసుపంపున బాలఘాతిని పూతన-

    పల్లెల, మందలఁ, బట్టణముల

నిల నెల్లచోఁ, బాలహింస గావించుచుఁ-

    జనుచు, నెవ్వని పేరు శ్రవణవీధిఁ

బడినయంతన సర్వభయనివారణ మగు-

    నట్టి దైత్యాంతకుం డవతరించి

యున్న నందునిపల్లె కొకనాడు ఖేచరి-

    యై వచ్చి యందు మాయాప్రయుక్తిఁ



10.1-212.1-తే.

గామరూపిణి యై చొచ్చి, కానకుండ

నరిగి, యిల్లిల్లు దప్పక యరసికొనుచు,

నందగృహమున బాలుని నాద మొకటి

విని ప్రమోదించి, సుందరీవేష యగుచు.

టీక:- కంసు = కంసుని యొక్క; పంపునన్ = ఆజ్ఞప్రకారము; బాల = శిశువులను; ఘాతని = హంతకురాలు; పూతన = పూతన (అను రాక్షసి); పల్లెలన్ = ఊర్లు యందు; మందలన్ = ఘోషము లందు; పట్టణములన్ = పురము లందు; ఇలన్ = భూమండలముమీద; ఎల్ల = అన్ని; చోన్ = ప్రదేశము లందు; బాల = శిశువులను; హింసన్ = చంపుట; కావించుచున్ = చేయుచు; చనుచున్ = పోతుండగా; ఎవ్వని = ఎవని యొక్క; పేరు = నామము; శ్రవణ = చెవుల; వీధిన్ = మార్గమున; పడినన్ = వినబడిన; అంతనన్ = వెంటనే; సర్వ = సమస్తమైన; భయ = భయములనుండి; నివారణము = విముక్తి; అగున్ = కలుగునో; అట్టి = అటువంటి; దైత్యాంతకుండున్ = విష్ణుమూర్తి; అవతరించి = పుట్టి; ఉన్న = ఉన్నట్టి; నందుని = నందుడు

యొక్క; పల్లె = వ్రేపల్లె; కున్ = కు; ఒక = ఒకానొక; నాడు = దినమున; ఖేచరి = అదృశ్యగమన {ఖేచరి - ఖః (ఆకాశమున, కనబడకుండగ) చరి (తిరుగునామె), అదృశ్య గమనము గల స్త్రీ}; ఐ = అయ్యి; వచ్చి = చేరి; అందున్ = దానిలో; మాయా = మాయను; ప్రయుక్తిన్ = పన్నుటచే; కామరూపిణి = మారువేషధారి.

ఐ = అయ్యి; చొచ్చి = ప్రవేశించి; కానకుండన్ = కనబడకుండగా; అరిగి = వెళ్ళి; ఇల్లిల్లున్ = ప్రతి ఇంటిని; తప్పకన్ = విడువకుండగ; అరసికొనుచున్ = వెతుక్కొనుచు; నంద = నందుని యొక్క; గృహమునన్ = ఇంటిలో; బాలునిన్ = చిన్నపిల్లవాని; నాదమున్ = చప్పుడు; ఒకటిన్ = ఒకదానిని; విని = విని; ప్రమోదించి = సంతోషించి; సుందరీ = మంచి అందగత్తె; వేష = వేషధారి; అగుచు = ఔతూ.

**భావము:-** కంసుడు పూతన అనే రాక్షసిని పంపించాడు. ఆ పూతన శిశువులను చంపడంలో ఆరితేరిన రక్కసి. అలా కంసుడు పంపగా వచ్చి, గ్రామాలు, గొల్ల పల్లెలు, పట్టణాలలో ఎక్కడ చంటి పిల్లలు కనబడినా చంపివేయ సాగింది. ఎవరి పేరు విన్నట్లయితే సమస్త భయాలు పోతాయో అట్టి ముకుందుడు ఉన్నట్టి నందుడి వ్రేపల్లెకు ఒకరోజు ఆకాశ మార్గాన వచ్చింది. మాయలు పన్నటంలో దిట్ట గనుక, కామరూపం ధరించి వ్రేపల్లె ప్రవేశించింది. ఎవరికి తెలియకుండ ప్రతి ఇంటిని పరిశీలిస్తోంది. నందుని ఇంట్లోంచి పిల్లాడి ఏడుపు విని సంతోషించింది. మంచి అందగత్తె వేషం వేసుకొంది.

## 10.1-213-మత్త.

**క్రాలు**కన్నులు, గుబ్బచన్నులుఁ, గందుఁవొందని చందురుం,
**బోలు** మోమును, గల్దు లేదను బుద్ధి దూఱని కౌను, హే
**రాళ**మైన పిఱుందు, పల్లవరాగ పాద కరంబులుం,
**జాల** దొడ్డగు కొప్పు, నొప్పగ సర్వమోహనమూర్తితోన్

**టీక:-** క్రాలు = చలించెడి; కన్నులున్ = కళ్ళు; గుబ్బ = గుండ్రటి; చన్నులున్ = స్తనములు; కందు = మచ్చ; ఒందని = లేనట్టి; చందురున్ = చంద్రుని; పోలు = వంటి; మోమునున్ = ముఖము; కల్దులేదు = ఉందోలేదో; అను = అనెడి; బుద్ధిన్ = ఆలోచన; దూఱని = కలుగని; కౌను = నడుము; హేరాళము = మిక్కిలి విశాలము; ఐన = అయిన; పిఱుందున్ = పిరుదులు;

పల్లవ = చిగుళ్ళవలె మృదువైన; రాగ = ఎఱ్ఱని; పాద = పాదములు; కరంబులున్ = చేతులు; చాలన్ = మిక్కిలిగా; దొడ్డ = పెద్దది; అగు = ఐన; కొప్పు = జుట్టుముడి; ఒప్పు = చక్కనిది; అగు = ఐన; సర్వ = అందరిని; మోహన = మోహింపజేసెడి; మూర్తి = స్వరూపము; తోన్ = తోటి.

భావము:- ప్రకాశవంతమైన కళ్ళు, వొంకమైన స్తనాలు, మచ్చలేని చంద్రుడి వంటి ముఖము. ఉందా లేదా అన్నట్లున్న సన్నని నడుము, విశాలమైన పిరుదులు. చివురు కొమ్మల వంటి ఎఱ్ఱని కాళ్ళు చేతులు. చాలా ఒత్తైన జుత్తుముడి. ఇలా చాలా అందమైన రూపంతో ఆమె అందరిని మోహింపజేసే రూపంతో వచ్చింది.

10.1-214-మాని.

కాంచనకుండల కాంతులు, గండయు-

గంబునఁ గ్రేళ్ళుఱుకన్, జడపై

మించిన మల్లెల మేలిమి తావులు-

మెచ్చి, మదాళులు మింటను రా,

నంచిత కంకణహారరుచుల్ చెలు-

వారఁగఁ, బైవలు వంచల నిం

చించుక జారఁగ నిందునిభానన-

యేగెఁ గుమారుని యింటికినై.

టీక:- కాంచన = బంగారు; కుండల = చెవికుండలముల; కాంతులున్ = తళతళలు; గండ = చెక్కిళ్ళ; యుగంబునన్ = జంటపై; క్రేళ్ళుఱుకన్ = చిందులాడగా; జడ = జడగా నల్లిన జుట్టు; పైన్ = మీద; మించిన = అతిశయించిన; మల్లెల = మల్లెపూల; మేలిమి = మంచి; తావులున్ = సువాసనలు; మెచ్చి = అపేక్షించి; మద = మత్తెక్కిన; ఆళులు = గండుతుమ్మెదలు; మింటను = ఆకాశము నందు; రాన్ = వస్తుండగా; అంచిత = అలంకరించుకొన్న; కంకణ = చేతికంకణములు; హార = మెడలోని హారముల; రుచుల్ = తళతళలు; చెలువారగన్ = అందగిస్తుండగా; పైవలువ = కొంగు; అంచలన్ = అంచులను; ఇంచించుకన్ = కొద్దికొద్దిగా; జాఱగన్ = జారునట్లుగా; ఇందునిభానన = సుందరి {ఇందునిభానన - చంద్రముఖి, అందగత్తె}; ఏగెన్ = వెళ్ళెను;

కుమారుని = బాలకృష్ణుని; ఇంటి = నివాసమున; కిన్నై = కోసము.

<u>భావము</u>:- బంగారపు లోలకుల కాంతులు చెక్కిళ్ళ మీద కేరింతలు కొడుతుండగా, జడ లోని చక్కటి మల్లెల సువాసనలకు ఆకర్షించబడిన తుమ్మెదలు గాలిలో వెన్నంటి వస్తుండగా, వేసుకున్న గాజులు, గొలుసులు కాంతులు విరజిమ్ముతుండగా, పైట కొద్దిగా జారుతుండగా. చంద్రుడిలాంటి అందమైన ముఖం గల పూతన బాలకృష్ణుడి ఇంటికి వెళ్ళింది.

సహజ కవి పోతన వారు, ఆ మాయా మానిని వర్ణిస్తూ మానిని వృత్తం వేశారు. ఎంత చక్కటి సందర్భోచిత ఛందస్సు ఎన్నిక.

10.1-215-వ.

**ఆ సమయంబునన్.**

<u>టీక</u>:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు.

<u>భావము</u>:- అలా ఆమె ఇంట్లోకి వెళుతున్న సమయంలో . . .

## పూతన బాలకృష్ణుని చూచుట

10.1-216-మ.

**సిరి మమ్ముఁన్ బ్రతుకంగఁ జూచుకొఱకై, శృంగారవేషంబుతో**
**నరుదేనోపు నటంచు గోపికలు జిహ్వాల్ రాక మోహించి త**
**త్పరులై చూడ, లతాంగి బోయి కనియెం, బర్యంక మధ్యంబునం**
**బరు, భస్మానలతేజు, దుర్జనవధ ప్రారంభకున్, డింభకున్.**

<u>టీక</u>:- సిరి = లక్ష్మీదేవి; మమ్ముఁన్ = మమ్ములను; బ్రతుకంగజూచుట = బతికించుట; కొఱకై = కోసము; శృంగార = అందమైన; వేషంబు = మారువేషము; తోన్ = తోటి; అరుదేనోపున్ = వచ్చి ఉండవచ్చును; అట = అని; అంచున్ = అనుచు; గోపికలు = గోపస్త్రీలు; జిహ్వాలు = మాటలు; రాక = పెగలక; మోహించి = మోహములో పడిపోయి; తత్ = ఆమె యందే; పరులు = ఆసక్తి కలవారు; ఐ = అయ్యి; చూడన్ = చూచుచుండగా; లతాంగి = సుందరి {లతాంగి -

లతలవంటి దేహము కలామె, స్త్రీ}; పోయి = వెళ్ళి; కనియెన్ = చూసెను; పర్యంక = పాన్పు; మధ్యంబునన్ = మధ్యలో; పరున్ = హరిని, కృష్ణుని; భస్మానల = నివురు కప్పిన అగ్నివంటి; తేజున్ = ప్రకాశము కలవానిని; దుర్జన = దుష్టులను; వధ = సంహరించుట; ప్రారంభకున్ = ప్రారంభించువానిని; డింభకున్ = బాలుని.

భావము:- పూతన అలా ఇంట్లోకి వెళుతున్న సమయంలో, లక్ష్మీదేవి ఇలా శృంగార వేషంతో మమ్మల్ని బ్రతికించడానికి వచ్చిందేమో అన్న భ్రాంతిలో పడిపోయారు, గోపికలు మాటలు పెగలనంత మైకంలో పడ్డారు, తదేక దృష్టితో అలా చూస్తూ ఉండిపోయారు. పూతన లోనికి వెళ్ళి మంచం మీద ఉన్నట్టి బాలకుడిని చూచింది. ఆ పరాత్పరుడు, నివురు గప్పిన నిప్పు లాంటి వాడని, దుష్టులను వధించడం ప్రారంభిస్తున్న వాడు అని ఆమెకు తెలియదు.

10.1-217-వ.

కని కదియవచ్చు సమయంబున.

టీక:- కని = చూసి; కదియవచ్చు = సమీపించెడి; సమయంబున = సమయమునందు.

భావము:- అలా చూసి శైశవరూపి కృష్ణమూర్తి దరికి పూతన చేరుతున్న సమయంలో. .

10.1-218-శా.

ఆ లోకేశ్వరుఁ, డా చరాచరవిభుం, డా బాలగోపాలుఁ, డా
బాలధ్వంసిని గొంటు కంటిడి వెసన్ బాలింతచందంబునన్,
బాలిండ్లన్ విష మూని, వచ్చుట మదిన్ భావించి, లో నవ్వుచున్
గాలుం గేలు నెఱుంగకున్న కరణిం గన్మోడ్చి, గుర్వెట్టుచున్.

టీక:- ఆ = ఆ; లోకేశ్వరుడు = కృష్ణుడు {లోకేశ్వరుడు – సమస్తమైన లోకములకు ప్రభువు, విష్ణువు}; ఆ = ఆ; చరాచరవిభుండు = కృష్ణుడు {చరాచరవిభుడు - కదల గలవి లేనివి రెంటికి ప్రభువు, విష్ణువు}; ఆ = ఆ; బాల = శిశురూపుడైన; గోపాలుడు = యాదవుడు, కృష్ణుడు; ఆ = ఆ; బాల = శిశు; ధ్వంసిని = హంతను; గొంటు = దుష్టురాలు; కంటన్ = పగ,

పట్టు; ఇడి = పట్టి; వెసన్ = శీఘ్రముగా; బాలింత = పసిబిడ్డతల్లి; చందంబునన్ = వలె; పాలిండ్లన్ = స్తనము లందు; విషమున్ = విషమును; ఊని = ధరించి; వచ్చుట = వచ్చుటను; మదిన్ = మనసులో; భావించి = ఊహించి; లోన్ = మనసులో; నవ్వుచున్ = నవ్వుకొనుచు; కాలున్ = ఇవి కాళ్ళు; కేలున్ = ఇవి చేతులు; ఎఱుంగకన్ = అని తెలియని స్థితిలో; ఉన్న = ఉన్నట్టి; కరణిన్ = విధముగ; కన్ = కళ్ళను; మోడ్చి = మూసికొని; గుర్వెట్టుచున్ = గుఱ్ఱుపెడుతు.

భావము:- అలా పూతన వస్తోంది. లోకాలు అన్నిటికి ఈశ్వరుడు. ఈ చరాచర జగత్తు అంతటికి ప్రభువు. బాల కృష్ణుడిగా అవతరించిన వాడు ఐన అతడు, ఆ శిశు హంతకిని చూశాడు. క్రూరాత్మురాలు దురాత్మురాలు అయిన ఆ పూతన కోరి బాలింతరాలి వేషంలో వక్షోజాలలో విషం ధరించి వస్తోంది అని గ్రహించాడు. లోలోపల నవ్వుకొని కాలు చెయ్యి తెలియకుండా నిద్రపోతున్నట్లు గుఱ్ఱు పెట్ట సాగాడు.

## పూతన కృష్ణుని ముద్దాడుట

10.1-219-క.

**ఆ పా**పజాతి సుందరి

యా **పా**పని పాన్పుఁ జేర నరిగి, కరములన్

**లేపి,** చనుంగవ శిశువున్

మోపుచు ముద్దాడి, శిరము మూర్కొని, పలికెన్.

టీక:- ఆ = ఆ; పాపజాతి = రాక్షస {పాపజాతి - దుష్కృత వంశస్థులు, రాక్షసులు}; సుందరి = స్త్రీ; ఆ = ఆ; పాపని = శిశువు యొక్క; పాన్పున్ = పక్క వద్దకి; చేరన = చేరుటకు; అరిగి = వెళ్ళి; కరములన్ = చేతులతో; లేపి = లేవదీసి; చను = స్తనముల; కవన్ = జంటను; శిశువున్ = చంటిపిల్లవానిని; మోపుచున్ = ఆన్చుచు; ముద్దాడి = ముద్దుపెట్టుకొని; శిరమున్ = తలను; మూర్కొని = మూజూచి; పలికెన్ = పలికెను.

భావము:- ఆ పాపిష్టి రాక్షసి మంచం దగ్గరకి వెళ్ళి, కృష్ణుడిని చేతుల లోకి తీసుకొంది. పాలిళ్ళకి హత్తుకొని, తల వాసన చూసి, ముద్దు పెట్టుకొంది.

10.1-220-క.

"చను నీకు గుడుపఁజాలెడి

చనువారలు లేరు; నీవు చనవలె"ననుచుం

"జనుఁగుడుపి, మీఁద నిలుకడఁ

జనుదాన" ననంగ, వేడ్కఁ జనుఁ జనుఁ గుడుపన్.

టీక:- చనున్ = చనుబాలను; నీ = నీ; కున్ = కు; కుడుపన్ = తాగించుటకు; చాలెడు = సమర్థులైన; చనువారలు = తగినవారు; లేరు = ఎవరూలేరు; నీవు = నీవు; చనవలెన్ = వెళ్ళవలెను, చావవలెను; అనుచున్ = అనుచు; చను = చనుబాలు; కుడిపి = తాగించి; మీదన్ = ఆపైన; నిలుకడన్ = నెమ్మదిగా; చనుదానన్ = వెళ్ళెదను, చనిపోయెదను; అనగన్ = అనెడి; వేడ్కన్ = కుతూహలముతో; చనున్ = వెళ్ళును; చను = చనుబాలు; కుడుపన్ = తాగించుటకు.

భావము:- బాలకృష్ణుని వద్దకు వస్తున్న శిశుహంతకి పూతన “నీకు చనుబాలు (చనుట) పట్టించ గల నేర్పరులు ఎవరు లేరయ్య. ఇంక నువ్వు పోవాలి.” అని లాలించింది. నీకు చనుబాలు (చనుట) పట్టించి అటుపిమ్మట మెల్లగా (తప్పక) పోతాలే (చనిపోతాలే) అంటున్నట్లు ఉత్సాహంతో స్తన్యం ఇవ్వడానికి బయలుదేరింది.

10.1-221-క.

"నా చనుఁబా లొక గ్రుక్కెఁడు

నో! చిన్నికుమార! త్రావు మొయ్యన; పిదపన్

నీ చెలువ మెఱుఁగ వచ్చును;

నా చెలువము సఫల మగును; నళినదళాక్షా!"

టీక:- నా = నా యొక్క; చనుబాలు = స్తన్యము; ఒక = ఒకే ఒక్క; గుక్కెడున్ = ఒక గుటక వేయగలిగి నంత; ఓ = ఓయీ; చిన్ని = చంటి; కుమార = పిల్లవాడ; త్రావుము = తాగుము; ఒయ్యనన్ = తిన్నగా; పిదపన్ = తరువాత; నీ = నీ యొక్క; చెలువము = చక్కదనమును;

ఎఱుగవచ్చును = చూడవచ్చును; నా = నా యొక్క; చెలువము = చందము; సఫలము = పండినది; అగును = అగును; నళినదళాక్ష = పద్మాక్షుడా.

<u>భావము</u>:- ఓ పద్మాలవంటి కన్నులు గల చిట్టి తండ్రీ! నా చనుబాలు ఒక్క గుక్కెడు తాగు. తరువాత నీ చక్కదనం ఎలా ఉంటుందో తెలుస్తుంది. నా అందానికి కూడ తగిన ఫలితం దక్కుతుంది."

10.1-222-వ.

**అని బాలు నుద్దేశించి, ముద్దాడెడి భంగి మాటలాడెడి చేడియం జూచి.**

<u>టీక</u>:- అని = అని; బాలున్ = బాలుని; ఉద్దేశించి = గురించి; ముద్దాడెడి = ముద్దు చేయుచున్న; భంగిన్ =విధంగా; మాటలాడెడి = మాట్లాడుచున్న; చేడియన్ = స్త్రీని; చూచి = కనుగొని;

<u>భావము</u>:- ఈ విధంగా ముద్దాడుతున్నట్లు కృష్ణుడితో మాట్లాడుతున్న పూతనను చూసి యశోదాదేవిరోహిణి అభ్యంతరం చెబుతూ. . .

## పూతన కృష్ణునికి పాలిచ్చుట

10.1-223-మ.

**"<u>వ</u>నితా! ముట్టకు మమ్మ; చన్ను గుడుపన్వల్దమ్మ; నీ చన్నుమా**
**<u>త</u>నయుం డొల్లఁడు; వాసి పొ"మ్మని యశో<u>దా</u> రోహిణుల్ జీరఁ, గై**
**<u>కొ</u>న, కీక్షించుచు మాయఁ బన్ని, పెలుచం <u>గో</u>శంబులో వాలు మె**
**<u>ల్పు</u>న రాజిల్లుచు, మాట మెత్తఁదనమున్, <u>లో</u>వాడియు న్నేర్పడన్.**

<u>టీక</u>:- వనితా = ఇంతి; ముట్టకుము = తాకవలదు; అమ్మ = తల్లి; చన్నున్ = స్తన్యమును; కుడుపన్ = తాగించుట; వలదు = వద్దు; అమ్మ = తల్లి; నీ = నీ యొక్క; చన్నున్ = స్తన్యమును; మా = మా యొక్క; తనయుండు = పిల్లవాడు; ఒల్లడు = అంగీకరించడు; పాసి = విడిచి; పొమ్ము = వెళ్ళిపొమ్ము; అని = అని; యశోద = యశోదాదేవి; రోహిణుల్ = రోహిణీదేవి; చీరన్ = పిలుచుచుండగా; కైకొనకన్ = లెక్కజేయకుండ; ఈక్షించుచున్ = చూచుచు; మాయన్ = మాయను; పన్ని = పరచి; పెలుచన్ = భయంకరముగ; కోశంబు = ఒర; లోన్ = లోని;

వాలున్ = కత్తి; మెల్పునన్ = వలె; రాజిల్లుచున్ = ప్రకాశించుచు; మాట = నోటి మాట యందలి; మెత్తదనమున్ = సున్నితత్వమును; లోన్ = మనసు నందు; వాడియున్ = తీవ్ర స్వభావమును; ఏర్పడన్ = కలుగునట్టుగ.

<u>భావము</u>:- "ఓ యమ్మా! మా బాబును ముట్టుకోకు. పాలివ్వద్దు. నీవెవరో మాకు తెలియదు. నీ స్తన్యం మా బాబు తాగడు. వదలిపెట్టి దూరంగా వెళ్ళిపో!" అని ఓ ప్రక్క ఈ విధంగా ముద్దాడుతున్నట్లు కృష్ణుడితో మాట్లాడుతున్న పూతనను చూసి యశోదాదేవి రోహిణి అభ్యంతరం చెబుతున్నారు, అరుస్తున్నారు. కాని మాటల మెత్తదనం మాటున వాడితనం కనబడకుండా దాగి ఉన్న ఆ పూతన, వారిని లెక్కచెయ్యకుండ మాయ పన్ని, ఒరలో ఉన్న పదునైన కత్తిలా కృష్ణుడిని చూస్తోంది.

10.1-224-వ.

**కదిసి కలికిపలుకులు పలుకుచు, నులుకుజెడి జళుకు నొరక, యెదుర నిదురంగదిరిన ఫణిని, ఫణి యని యెఱుంగక, గుణమతిం దిగుచు జడమతి బెడంగునఁ, గఱటి జఱభితెఱవ వెరవునం జనుదెంచి, పఱపునడుమ నొఱపు గలిగి, మెఱయుచుఁ, గనుంగవం దెఱవక, వెఱపు మఱపు నెఱుంగక, కొమరుమిగులు చిఱుత కొమరునిం దిగిచి, తొడలనడుమ నిడుకొని, యొడలు నివురుచు, నెడనెడ మమతం గడలుకొలుపుచు, "నాఁకొన్న చిన్నియన్న! చన్ను గుడువు" మని చన్నిచ్చు సమయంబున.**

<u>టీక</u>:- కదిసి = చేరి; కలికి = మనోజ్ఞమైన; పలుకులు = మాటలు; పలుకుచున్ = చెప్పుతు; ఉలుకుచెడి = బెదురు లేకుండ; జళుకున్ = తత్తరపాటును; చొరకన్ = పొందకుండగ; ఎదురన్ = తన యెదుట; నిదురన్ = నిద్ర; కదిరిన = పోయిన; ఫణిని = పామును; ఫణి = పాము; అని = అని; ఎఱుంగక = తెలిసికొనలేక; గుణమతిన్ = తాడు అని భ్రమించి; తిగుచు = లాగుటకు యత్నించు; జడమతిన్ = బుద్ధిహీనుని; బెడంగునన్ = విధముగ; కఱటి = వంచకురాలు; జఱభితెఱవ = దుష్టురాలు; వెరపునన్ = బెదురుగ; చనుదెంచి = వచ్చి; పఱపు = పాన్పు;

నడుమన్ = మధ్యన; ఒఱపు = చక్కదనములు; కలిగి = ఉండి; మెఱయుచున్ = ప్రకాశించెడి; కనున్ = కళ్ళ; కవన్ = జంటను; తెఱువకన్ = తెరవకుండ; వెఱపు = బెదురు; మఱపు = నదరు; ఎఱుంగక = లేకుండగ; కొమరు = మనోజ్ఞత; మిగులు = అతిశయించెడి; చిఱుత = చంటి; కొమరున్ = పిల్లవానిని; తిగిచి = తీసుకొని; తొడలనడుమ = ఒడిలో; ఇడుకొని = ఉంచుకొని; ఒడలు = దేహము; నివురుచున్ = తడువుతు; ఎడనెడ = మధ్యమధ్యలో; మమతన్ = ప్రేమను; కడలుకొలుపుచు = కలిగించుచు; ఆకొన్న = ఆకలితోనున్న; చిన్ని = చంటి; అన్న = నాయనా; చన్నున్ = చనుబాలు; కుడువుము = తాగుము; అని = అని; చన్నున్ = స్తనమును; ఇచ్చు = అందిచ్చెడి; సమయంబునన్ = సమయము నందు.

**భావము:-** ఈ విధంగా తియ్యని మాటలతో నదురు బెదురు లేకుండా పక్క దగ్గరకి వచ్చింది. తెలివి లేని వాడు ఎదురుగుండా నిద్రపోతున్న పామును, పాము అని తెలియక, తాడు అనుకొని చేతితో లాగుతున్నట్లు, ఆ క్రూరురాలైన దుష్ట యువతి పిల్లాడి మంచం దగ్గరకి వచ్చింది. పరుపు మీద కృష్ణుడు చక్కటి కాంతులతో ప్రకాశిస్తూ, కళ్ళు తెరవకుండా, భయం మరుపులు లేక అందాలు చిందిస్తున్నాడు. ఆ చిరు బాలుని ఒడిలోకి తీసుకొని, ఒళ్ళు నిమురుతూ, వాత్సల్యం చూపుతోంది “ఓ నా చిన్ని కన్న! దా, నా చనుబాలు తాగు నాయనా!” అంటు చనుబాలు పట్టబోతోంది. అప్పుడు.

## పూతన సత్తువ పీల్చుట

10.1-225-సీ.

మేల్కొన్న తెఱఁగున మెల్లనఁ గనువిచ్చి-

క్రేగంటఁ జూచుచుఁ, గిదికి నీల్గి,

యావులించుచుఁ జేతు లాకసంబునఁ జాఁచి-

యొదిఁగిలి యాఁకొన్న యోజ నూది,

బిగిచన్నుఁగవఁ గేలఁ బీడించి, కబళించి-

గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకు మనుచు,

నొక రెండు గ్రుక్కల నువిద ప్రాణంబులు-

సైతము, మేనిలో సత్వ మెల్లఁ

10.1-225.1-తే.

ద్రావె, నదియును గుండెలు దల్లడిల్ల,

జిమ్మ దిరుగుచు నిలువక, శిరము వ్రాల

"నితర బాలుర క్రియవాఁడ వీవు గావు;

చన్ను విడువుము; విడువుము; చాలు"ననుచు.

**టీక:-** మేల్కొన్న = నిద్రలేచిన; తెఱంగునన్ = విధముగ; మెల్లనన్ = మెల్లిగా; కను = కళ్ళు; విచ్చి = తెరచి; క్రేగంటన్ = ఓరకంటితో; చూచుచున్ = చూచుచు; కిదికి = ఒడలువిరుచుకొని; నీల్గి = నిక్కి; ఆవులించుచున్ = ఆవులిస్తూ; చేతులున్ = చేతులను; ఆకసంబునన్ = పైకి; చాచి = చాసి; ఒదిగిలి = ఒత్తిగిలి; ఆకొన్న = ఆకలివేయుచున్న; ఓజన్ = విధముగ; ఊది =వహించి; బిగి = బిగుపైన; చన్నున్ = స్తనముల; కవన్ = జంటను; కేలన్ = చేతులతో; పీడించి = పిసికి; కబళించి = నోటిలో పెట్టుకొని; గ్రుక్కగ్రుక్కకున్ = ఒక్కొకగుక్కపీల్చునపుడు; గుటుగుటుకున్ = గుటుక్కుగుటుక్కు (మ్రింగుట యందలి ధ్వన్యనుకరణ); అనుచు = అని శబ్దముతో తాగుతూ; ఒకరెండు = రెండేరెండు; గ్రుక్కలను = గుక్కలతో; ఉవిద = స్త్రీ; ప్రాణంబులన్ = ప్రాణవాయువుల;

సైతము = తోపాటు; మేని = దేహము; లోన్ = అందలి; సత్వము = శక్తి; ఎల్లన్ = అంతటిని; త్రావెన్ = తాగివేసెను; అదియునున్ = ఆమెకూడ.

గుండెలు = హృదయము; తల్లడిల్లన్ = అలమటించగా; జిమ్మ = అధికముగా; తిరుగుచున్ = భ్రమించుచు; నిలువకన్ = తట్టుకొనలేక; శిరమున్ = తలను; వ్రాలన్ = వాలిపోతుండగా; ఇతర = మిగిలిన; బాలుర = పిల్లల; క్రియన్ = వంటి; వాడవు = వాడివి; ఈవున్ = నీవు; కావు = కావు; చన్నున్ = స్తనమును; విడువుము = వదలిపెట్టుము; విడువుము = విడిచిపెట్టుము; చాలున్ = ఇక చాలు; అనుచున్ = అంటు.

<u>భావము</u>:- కృష్ణుడు అప్పుడే నిద్ర చాలించి నట్లు, మెలకువ వచ్చినట్లు, మెల్లగా కళ్ళు తెరిచాడు. ముక్కి, ఒళ్ళు విరుచుకొని ఆవలిస్తూ, క్రీగంట చూశాడు. చేతులు పైకి చాపి, ఒత్తిగిల్లాడు. ఎంతో ఆకలితో ఉన్నట్లు చేతులతో ఆమె చన్నులు రెండు గట్టిగా పట్టుకొని నొక్కాడు. తాగుతూనే రెండు గుక్కలలో గుటుక్కు గుటుక్కు మని పూతన ఒంటిలోని సత్తువ అంతా ప్రాణాలతో సహా తాగేశాడు. దాని గుండెలు తల్లడిల్లి పోయాయి. నాలుక లుంగచుట్టుకుపోయింది. తల నిలపలేక వాల్చేసింది "అయ్యబాబోయ్. నువ్వు మిగతా పిల్లలలాంటి వాడివి కాదు. ఇంక చాలు. నా చన్ను వదలిపెట్టు." అంటు గిలగిలలాడి పోయింది.

## పూతన నేలగూలుట

10.1-226-క.

**నిబ్బరపు దప్పి మంటలు**
**<u>ప్ర</u>బ్బిన, ధృతి లేక, నేత్ర <u>ప</u>ద హస్తంబుల్**
**గొబ్బున వివృతములుగ, నా**
**<u>గు</u>బ్బనుచున్నట్టి కూఁతఁ <u>గూ</u>లెన్ నేలన్.**

<u>టీక</u>:- నిబ్బరపు = అధికమైన; దప్పిన్ = దాహముతో; మంటలు = మండిపోవుటలు; ప్రబ్బినన్ = వ్యాపించగా; ధృతి =ధైర్యము; లేక = తప్పి; నేత్ర = కళ్ళు; పద = కాళ్ళు; హస్తంబుల్ = చేతులు; గొబ్బునన్ = శీఘ్రముగా; వివృతములుగన్ = విస్తారమైనట్టి; ఆ = ఆ; గుబ్బు = గుబ్బు (కూలుట యందలి ధ్వన్యనుకరణ); అనుచున్నట్టి = అనెడి; కూతన్ = శబ్దముతో;

కూలెన్ = పడిపోయెను; నేలన్ = నేలమీద.

భావము:- పూతనకు భయంకరమైన మంటలు లోపలి నుంచి చెలరేగాయి. కాళ్ళు చేతులు వంకరలు తిరిగిపోయి నేలమీద పడిపోయింది. కను గుడ్లు పెళ్ళుకొచ్చాయి. పెద్ద ఆర్తనాదంతో కూలి చచ్చిపోయింది.

10.1-227-మ.

అదరెం గొండలతోడ భూమి; గ్రహతారానీకముల్ మింటిపై
బెదరెన్; దిక్కుల మాఱు మ్రోత లెసఁగెన్; భీతిల్లి లోకంబులుం
గదలం బాఱెను; వజ్రభిన్న గిరిరేఖం బూర్వదేహంబుతోఁ
ద్రిదశధ్వంసిని గూలి, కుయ్యిడిన దద్దీర్ఘోరు ఘోషంబునన్.

టీక:- అదరెన్ = కంపించెను; కొండల = గిరుల; తోడన్ = తోపాటు; భూమి = నేల; గ్రహ = గ్రహములు; తార = నక్షత్రముల; అనీకముల్ = సమూహములు; మింటి = ఆకాశము; పైన్ = మీద; బెదరెన్ = భయబడినవి; దిక్కుల = నల్దిక్కు లందు; మాఱుమ్రోతలు = ప్రతిధ్వనులు; ఎగసెన్ = లేచినవి; భీతిల్లి = భయపడిపోయి; లోకంబులున్ = ముల్లోకముల జీవులు; కదలంబాఱెను = కలతచెందెను; వజ్ర = వజ్రాయుధముచేత; భిన్న = నరకబడిన; గిరి = పర్వతము; రేఖన్ = వలె; పూర్వదేహంబు = ఎప్పటి రూపు; తోన్ = తోటి; త్రిదశ = దేవతలను; ధ్వంసిని = హింసించెడి ఆమె; కూలి = పడిపోయి; కుయ్యిడినన్ = కుయ్యో మనగా; తత్ = ఆ యొక్క; దీర్ఘ = పెద్దదైన; ఉరు = గట్టి; ఘోషంబునన్ = అరుపుతో.

భావము:- ఆ రాక్షసికి చావు దగ్గర పడటంతో, తన భయంకర రూపం వచ్చేసింది. పెద్ద గావుకేక పెట్టి, ఇంద్రుని వజ్రాయుధం దెబ్బకు కూలిన కొండలా పెద్ద దేహంతో దభాలున నేల కూలింది. అతి భీకరమైన ఆ ధ్వనికి దిక్కులన్నీ ప్రతిధ్వనించాయి. పర్వతాలతో పాటు భూమి అదిరింది. ఆకాశంలో గ్రహాలు, తారలు కదిలి పోయాయి. లోకాలు అన్ని బెదరి చెదరి పోయాయి.

10.1-228-క.

**అప్పుడు దెప్పరమగు నా**

**చప్పుడు హృదయములఁ జొచ్చి, సందడి పెట్టన్,**

**ముప్పిరిఁగొని పడి; రెఱుకలు**

**దప్పి ధరన్, గొల్ల లెల్లఁ దల్లడపడుచున్**

టీక:- అప్పుడు = ఆ సమయము నందు; తెప్పరము = దుస్సహమైనది; అగు = ఐన; ఆ = ఆ; చప్పుడు = శబ్దము; హృదయములన = గుండెలలో; చొచ్చి = దూరి; సందడి = సంకట; పెట్టన్ = పెడుతుండగా; ముప్పిరిగొని = ఉక్కిరిబిక్కిరి; పడిరి = ఐపోయిరి; ఎఱుకలు = దేహస్మృతులు; తప్పి = తప్పిపోయి; ధరన్ = నేలమీద; గొల్లలు = గోపకులు; ఎల్లన్ = అందరును; తల్లడపడుచున్ = తత్తరపడుతు.

భావము:- భయంకరమైన ఆ శబ్దం గోపకుల హృదయాలలో దూరి అలజడి రేపింది. వారు అందరు భయంతో బెంబేలుపడి, మెలికలు తిరుగుతూ, స్పృహతప్పి పడిపోయారు.

10.1-229-క.

**ఆ జఱభిరండ రక్కసి**

**నైజశరీరంబు నేల నలియంబడినన్**

**యోజనమున్నర మేర ధ**

**రాజంబులు నుగ్గులయ్యె, రాజవరేణ్యా!**

టీక:- ఆ = ఆ; జఱభి = దుష్టురాలు(తిట్టు); రండ = కుంకముండ (తిట్టు); రక్కసి = రాక్షసి; నైజ = తన సహజమైన; శరీరంబున్ = దేహముతో; నేలన్ = భూమి; నలియన్ = నలిగిపోవునట్లుగా; పడినన్ = పడిపోగా; యోజనమున్నర = ఒకటిన్నర యోజనముల; మేరన్ = వరకు; ధరాజంబులు = చెట్లు {ధరాజము - ధర (నేల)ను జము (పుట్టినది), చెట్టు}; నుగ్గులు = చూర్ణములైనవి; అయ్యెన్ = అయినవి; రాజవరేణ్య = మహారాజ.

భావము:- పరీక్షిన్మహారాజా! క్రూరురాలు, నీచురాలు ఐన ఆ రక్కసి తన అసలు దేహంతో నేలమీద పడిపోవడంతో, ఒకటిన్నర ఆమడల (12 లేదా 14 కిమీ) పరిధిలోని చెట్లన్నీ నుగ్గు నుగ్గు అయిపోయాయి. (యోజనం / ఆమడ అంటే 8 నుండి 9 కిమీలకు సమానం)

10.1-230-సీ.

దారుణ లాంగలదండ దంతంబులు-
నగ గహ్వరముఁ బోలు నాసికయును,
గండశైలాకృతి గల కుచయుగమును-
విరిసి తూలెడు పల్లవెండ్రుకలును,
జీఁకటినూతులఁ జెనయు నేత్రంబులుఁ-
బెనుదిబ్బఁ బోలెడి పెద్ద పిఱుఁదుఁ,
జాఁగుకట్టలఁ బోలు చరణోరుహస్తంబు-
లింకినమడువుతో నెనయు కడుపుఁ,

10.1-230.1-తే.

గలిగి షట్క్రోశ దీర్ఘమై కదిసి చూడ,
భయదమగు దాని ఘనకళేబరముఁ జూచి,
గోపగోపీజనంబులు గుంపుగూడి,
బెగడుచుండిరి మనముల బెదరు గదిరి.

టీక:- దారుణ = భయంకరమైన; లాంగలదండ = నాగలిదండము, నాగలిమేడి; దంతంబులున్ = పళ్ళు; నగ = కొండ; గహ్వరమున్ = గుహ; పోలు = వంటి; నాసికయును = ముక్కు; గండశైల = గండ్రాళ్ళు; ఆకృతి = వంటిరూపు; కల = కలిగిన; కుచ = స్తనముల; యుగమును = జంట; విరిసి = విరబోసుకొని; తూలెడు = చలించెడి; పల్ల = కావిరంగు;

వెంట్రుకలును = శిరోజములు; చీకటి = అంధకారమయమైన; నూతులన్ = బావుల; చెనయు = వంటి; నేత్రంబులున్ = కళ్ళు; పెను = పెద్ద; దిబ్బన్ = మట్టిదిబ్బలను; పోలెడి = వంటి; పెద్ద = పెద్దపెద్ద; పిఱుదున్ = పిఱ్ఱలు; చాగు = దీర్ఘమైన; కట్టలున్ = కట్టెలు; పోలు = వంటి; చరణ = కాళ్ళు; ఊరు = తొడలు; హస్తంబులు = చేతులు; ఇంకిన = ఎండిపోయిన; మడువు = చెరువు; తోన్ = తోటి; ఎనయు = పోలెడి; కడుపున = పొట్ట; కలిగి = ఉండి.
షట్ = ఆరు (6); క్రోశ = కోసుల; దీర్ఘము = పొడవుకలది; ఐ = అయ్యి; కదిసి = దగ్గరకు వెళ్ళి; చూడన్ = చూచుటకు; భయదము = భీకరము; అగు = అయిన; దాని = ఆమె యొక్క; ఘన = పెద్ద; కళేబరమున్ = ప్రాణములేని కట్టెను; చూచి = కనుగొని; గోప = గోపకులు; గోపీ = గోపికలైన; జనంబులు = వారు; గుంపుగూడి = గుంపులుకట్టి; బెగడుచుండిరి = వెరచుచుండిరి; మనములన్ = మనసులందు; బెదురు = భయము; కదిరి = కలిగి.

భావము:- ఆ రాక్షసి కోరలు నాగలిమేడి అంత ఉన్నాయి. ముక్కు రంధ్రాలు కొండ గుహలలా ఉన్నాయి. స్తనాలు రెండు కొండరాళ్ళ లాగ ఉన్నాయి. ఎఱ్ఱని వెంట్రుకలు గాలికి ఎగురుతున్నాయి. కళ్ళు చీకటి నూతులు కన్న లోతుగా ఉన్నాయి. విశాలమైన పిరుదులు పెద్ద దిబ్బలని పోలి ఉన్నాయి. కాళ్ళు చేతులు పొడుగైన కాలువ కరకట్టలు వలె ఉన్నాయి. కడుపు ఇంకిపోయిన చెరువులా ఉంది. ఆరు క్రోసుల (3.6X6 కిమీ) పొడవైన దాని భయంకరమైన పెద్ద దేహాన్ని గొల్ల స్త్రీలు గొల్ల పురుషులు గుంపులుగా చూసి మనసులో బెదురు పుట్టి, కళవళ పడుతున్నారు.

10.1-231-వ.

ఇ వ్విధంబునన్.

టీక:- ఈ = ఈ; విధంబునన్ = విధముగ. భావము:- ఇలా

10.1-232-క.

ఆ తఱిఁ గుడువఁగ నడచెన్,

నూతనఫుల్లాబ్జలోచనుఁడు, హరి మృత్యు

ద్యోతనఁ గృతముని సముదయ

యాతనఁ, బూతన నెఱింగి యాతనలీలన్.

టీక:- ఆ = ఆ; తఱిన్ = సమయము నందు; కుడువగన్ = చనుబాలు తాగుట ద్వారా; అడచెను = అణచివేసెను; నూతనఫుల్లాబ్జలోచనుడు = బాలకృష్ణుడు {నూతన ఫుల్లాబ్జ లోచనుడు - కొత్తగా విరిసిన పద్మములవంటి కన్నులు కలవాడు, విష్ణువు}; హరి = బాలకృష్ణుడు {హరి - భక్తుల పాపములను హరించువాడు, విష్ణువు}; మృత్యు = మరణమును; ద్యోతనన్ = కనిపింపజేయు ఆమెను; కృత = కలిగించిన; ముని = ఋషుల యొక్క; సముదయ = సమూహములకు; యాతనన్ = కష్టపెట్టెడి ఆమె; పూతనన్ = పూతనను; ఎఱింగి = తెలిసికొని; ఆ = అటువంటి; తన = తన యొక్క; లీలన్ = లీలాకృత్యముతో.

భావము:- ఈ విధంగా, అప్పుడే విరిసిన పద్మాల వంటి కన్నులున్న కృష్ణుడు, చనుబాలు తాగే నెపంతో పూతనను అవలీలగా సంహరించాడు. మరి ఆ రక్కసి మృత్యువులాగా పసిపిల్లలని చంపేది, మునులను బాధ పెట్టేది, యాతనలపాలు చేసేది కదా.

10.1-233-క.

విషధరరిపు గమనునికిని

విషగళ సఖునికిని, విమల విష శయనునికిన్,

విషభవభవ జనకునికిని,

విషకుచచను విషముఁ గొనుట విషమే తలపఁన్?

టీక:- విషధర రిపు = గరుత్మంతునిపై {విషధర రిపుడు - విషధర (సర్పములకు) రిపుడు (శత్రువు), గరుత్మంతుడు}; గమనుని = విహరించువాని; కిని = కి; విషగళ = పరమశివుని {విషగళుడు - విషమును కంఠమున ధరించినవాడు, శంకరుడు}; సఖుని = స్నేహితుని; కిని = కి; విమల = నిర్మలమైన; విషశయనుని = శేషశాయి {విషశయనుడు - విష (జలము)పై శయనుడు, విష్ణువు}; కిన్ = కి; విషభవభవ = బ్రహ్మదేవుని {విషభవభవుడు - విష (నీటియందు) భవ (పుట్టెడిది) యైన పద్మమున భవ (పుట్టినవాడు), బ్రహ్మ}; జనకుని = తండ్రి; కిని = కి; విష = విషము పూసిన; కుచ = స్తనముల; చను =వెలువడు; విషమున్ = విషమును; కొనుట = తీసుకొనుట; విషమే = కష్టమా, కాదు; తలపన్ = తరచిచూసినచో.

భావము:- విషము కోరలలో ధరించే నాగులను చీల్చెడి గరుత్మంతుడు

వాహనంగా కలవాడు, కంఠమున విషము ధరించెడి శంకరుని మిత్రుడు, ప్రళయకాలమున విషము (జలము)పై శయనించు నిర్మలమైన వాడు, విషము (నీటి) యందు పుట్టెడి పద్మము నందు జనించిన వాడైన బ్రహ్మదేవునికి తండ్రియైన వాడు అయినట్టి సాక్షాత్తు మహావిష్ణువు యైన ఈ బాలుడికి విషము చిమ్మే చన్నులతో తిరిగే ఒక రాకాసి విషం లాగివేయటం విషమ (పెద్ద కష్ట)మైన పనా, కానేకాదు.

10.1-234-వ.

**అంత నా గోపగోపీజనంబులు దెలిసి, రోహిణీయశోదలం గూడుకొని, బెగ్గడిలక డగ్గఱి.**

టీక:- అంతన్ = అప్పుడు; ఆ = ఆ; గోప = గోపకులు; గోపీ = గోపికలైన; జనంబులు = వారు; తెలిసి = తెలిసికొని; రోహిణీ = రోహిణీదేవి; యశోదలన్ = యశోదాదేవిలను; కూడుకొని = తోపాటు; బెగ్గడిలక = వెరవకుండగ; డగ్గఱి = దగ్గరకువెళ్ళి.

భావము:- ఇంతలో ఆ విషయం ఆ గొల్లవాళ్ల లోని స్త్రీ పురుషులకు అందరికి తెలిసింది. యశోదా రోహిణిలతో కలిసి వచ్చి బెదరిపోకుండా దగ్గరకి వచ్చి. . .

10.1-235-శా.

**నేలంగూలిన దాని పెన్నురముపై నిర్భీతిఁ గ్రీడింప, "నో!**
**బాలా! ర"మ్మని మూపుఁ జేర్చుకొని, సంస్పర్శించి, యూరార్చుచున్**
**గోలాంగూలముఁ ద్రిప్పి, గోవురజమున్ గోమూత్రముం జల్లి, త**
**ద్బాలాంగంబుల గోమయం బలఁది; రా పండ్రెండు నామంబులన్.**

టీక:- నేలన్ = భూమిపైన; కూలిన = పడిపోయిన; దాని = ఆమె యొక్క; పెన్ను = బాగ పెద్ద; ఉరము = వక్షస్థలము; పైన్ = మీద; నిర్భీతిన్ = భయము లేకుండగ; క్రీడింపన్ = ఆడుకొంటుండగా; ఓ = ఓయీ; బాలా = పిల్లవాడా; రమ్ము = రా; అని = అని; మూపున్ = భుజముపై; చేర్చుకొని = ఎత్తుకొని; సంస్పర్శించి = ఒడలు నిమిరి; ఊరార్చుచున్ = ఊరడించుచు; గో = ఆవు యొక్క; లాంగూలమున్ = తోకను; త్రిప్పి = దిగదుడిచి; గోవు = ఆవు

యొక్క; రజమున్ = కాలి దుమ్మును; గో = ఆవు యొక్క; మూత్రమున్ = పంచితము (ఉచ్చ); చల్లి = చిలకరించి; తత్ = ఆ; బాల = పిల్లవాని; అంగంబులన్ = ద్వాదశావయవములకు (12) {ద్వాదశావయవములు - 1నుదురు 2మెడ 3రొమ్ము 4బొడ్డు 5-6మూపులు 7-8మోచేతులకీళ్ళు 9-10మణికట్టులు 11-12మోకాళ్ళు}; గో = ఆవు యొక్క; మయంబున్ = పేడను; అలదిరి = రాసిరి; ఆ = ఆ; పండ్రెండు = ద్వాదశ (12); నామంబులన్ = కేశవనామములు.

<u>భావము</u>:- చచ్చి పడి ఉన్న ఆ రాకాసి విశాలమైన వక్షస్థలం మీద చిన్నికృష్ణుడు నిర్భయంగా ఆడుకుంటున్నాడు. రమ్మని పిలిచి ఎత్తుకున్నారు ఒళ్ళు నిమురుతూ ఓదార్చారు. పీడ వదలిపోడానికి ఆవుతోక పిల్లవాడి చుట్టు తిప్పి దిష్టి తీశారు. గోధూళిని, గోమూత్రాన్ని బాలుని మీద చల్లారు. పన్నెండు నామాలతో పన్నెండు అవయవాలు లోను గోమయము (ఆవుపేడ) పట్టించారు.

10.1-236-వ.

మఱియు నంతటం దనియక, గోపిక లాచమనంబు జేసి దక్షులై, మునుపుగాఁ దమకు రక్షాకరంబగు బీజన్యాసంబు సేసికొని, "చిన్నియన్న! నీ యడుగు లజుండును, జానువు లనిలుండును, దొడలు యజ్ఞుండును, గటితలం బచ్యుతుండును, గడుపు హయాస్యుండును, హృదయంబు గేశవుండును, నురము నీశుండును, గంఠంబు నినుండును, భుజంబుల జతుర్భుజుండును, ముఖంబు త్రివిక్రముండును, శిరం బీశ్వరుండును రక్షింతురు; ముందు చక్రియు, వెనుక గదాధరుండైన హరియుఁ, బార్శ్వంబుల ధనుర్ధరుండైన మధువైరియు, నసిధరుండగు నజనుండును, గోణంబుల శంఖచక్ర గదాధరుండైన యురుగాయుండును, మీఁదు నుపేంద్రుడును, గ్రిందు దార్క్ష్యుండు, నంతటను హలధరుండగు

పురుషుండును, గాతురు; నీ యింద్రియంబుల హృషీకేశుండును,
బ్రాణంబుల నారాయణుండును, జిత్తంబు శ్వేతద్వీపపతియును,
మనంబును యోగీశ్వరుండైన కపిలుండును, బుద్ధిని బృశ్నిగర్భుండు,
నహంకారంబున భగవంతుండైన పరుండును బాలనంబు
సేయుదురు; నీవు క్రీడించునెడ గోవిందుండును, శయనించు తఱి
మాధవుండును, నడచువేళ వైకుంఠుండును, గూర్చున్న
సమయంబున శ్రీపతియును, గుడుచు కాలంబున సర్వభక్షకుం
డయిన యజ్ఞభుజుండు నేమఱకుండుదురు; నిన్నుఁ బేర్కొనిన
దుస్స్వప్న వృద్ధబాలగ్రహంబులును, గూశ్మాండ, డాకినీ,
యాతుధానులును, భూత ప్రేత యక్ష రాక్షస పిశాచ వినాయకులును,
గోటరాదులును, జ్యేష్ఠాది భూతనాథులును, మాతృకాదిగణంబులు
నశియింతురు; నీ యందుఁ బ్రాణేంద్రియ శరీరనిరోధంబు లైన
యున్మాదంబులు, నపస్మారంబులును, మహోత్పాతంబులును
బొందకుండుం గావుత!"యని రక్షచేసి దీవించి; రంత.

**టీక:-** మఱియున్ = ఇంకను; అంతటన్ = వానితో; తనియకన్ = తనివితీరక; గోపికలు = గొల్లస్త్రీలు; ఆచమనంబు = కేశవాది నామములు జపించి పుడిసిలి(అరచేతి)తో నీరు తీసుకొని; చేసి = చేసి; దక్షులు = అర్హత కలవారు; ఐ = అయ్యి; మునుపుగాన్ = ముందుగా; తమ = వారి, స్వంతమునకు; కున్ = కి; రక్షాకరంబు = రక్షణ కలిగించునవి; అగు = ఐన; బీజన్యాసంబున్ = బీజన్యాసమును {బీజన్యాసముచేయుట - ప్రణవాదిగా ద్వాదశాక్షరి (ఓంనమో భగవతే వాసుదేవాయః) జపము అంగన్యాస పూర్తిగా (లలాటాది స్థానములను తాకుట కలదిగా) ఆచరించుట}; చేసికొని = చేసికొని; చిన్ని = చంటి; అన్న = తండ్రి; నీ = నీ యొక్క; అడుగులన్ = అడుగుల యందు; అజుండును = బ్రహ్మదేవుడు; జానువులన్ = మోకాళ్ళను; అనిలుండును = వాయుదేవుడును; తొడలన్ = తొడలను; యజ్ఞుండును =

యజ్ఞమూర్తి ఐన అగ్ని; కటి = మొల; తలంబునన్ = ప్రాంతమును; అచ్యుతుండును = విష్ణుమూర్తి {అచ్యుతుడు - చ్యుతము (జారుట) లేనివాడు, విష్ణువు}; కడుపున్ = బొజ్జను; హయాస్యుండును = హయగ్రీవమూర్తి; హృదయంబున్ = మనసును; కేశవుండును = విష్ణుమూర్తి {కేశవుడు - కేశి అనెడి రాక్షసిని చంపినవాడు, విష్ణువు}; ఉరమున్ = వక్షస్థలమును; ఈశుడున్ = ఈశానుడును; కంఠంబున్ = గొంతును; ఇనుండును = సూర్యుడు; భుజంబులన్ = బాహువులను; చతుర్భుజుండును = విష్ణుమూర్తి {చతుర్భుజుడు - నాలుగు చేతులు గలవాడు, విష్ణువు}; ముఖంబున్ = మోమును; త్రివిక్రముండును = వామనుడు {త్రివిక్రముడు - ముల్లోకమును ఆక్రమించిన వాడు, వామనావతారుడు, విష్ణువు}; శిరంబున్ = తలను; ఈశ్వరుండును = పరమశివుడు; రక్షింతురు = కాపాడుగాక; ముందు = ముందు వైపు; చక్రియున్ = విష్ణుమూర్తి {చక్రి - చక్రము ఆయుధముగా కలవాడు, విష్ణువు}; వెనుకన్ = వీపు వైపు; గదా = గదాయుధము; ధరుండు = ధరించినవాడు; ఐన = అయిన; హరియున్ = విష్ణుమూర్తి; పార్శ్వంబులన్ = ఇరుపక్కల; ధనుస్ = విల్లును; ధరుండు = ధరించినవాడు; ఐన = అయిన; మధువైరియున్ = విష్ణుమూర్తి {మధువైరి - మధు అనెడి రాక్షసుని శత్రువు, విష్ణువు}; అసి = ఖడ్గమును; ధరుండు = ధరించినవాడు; అగు = అయిన; అజనుండును = అజనుడు; కోణంబులన్ = మూలలందు; శంఖ = శంఖము; చక్ర = చక్రము; గదా = గద; ధరుండు = ధరించినవాడు; ఐన = అయిన; ఉరుగాయుండును = ఉరుగాయుడు; మీదను = పైభాగమందు; ఉపేంద్రుడును = విష్ణుమూర్తి {ఉపేంద్రుడు - ఇంద్రుని సోదరుడు, విష్ణువు}; క్రిందున్ = కిందవైపునందు; తార్క్ష్యుండును = గరుడుడు; అంతటను = సర్వప్రదేశములందును; హల = నాగేలు ఆయుధము; ధరుండు = ధరించినవాడు; అగు = ఐన; పురుషుండును = సర్వకారణభూతుండు; కాతురు = కాపాడుగాక; నీ = నీ యొక్క; ఇంద్రియంబులన్ = సర్వేంద్రియములను {ఏకదశేంద్రియములు - 5జ్ఞానేంద్రియములు (1కన్ను 2ముక్కు 3నాలుక 4చెవి 5చర్మము) 5కర్మేంద్రియములు (1కాళ్ళు 2చేతులు 3నోరు 4గుహ్యేంద్రియము 5గుదము) మరియు 1మనసు మొత్తం 11}; హృషీకేశుండును = విష్ణుమూర్తి {హృషీకేశుడు - హృషీకము (ఇంద్రియము)లకు ఈశుడు (ప్రభువు), విష్ణువు}; ప్రాణంబులన్ = పంచప్రాణములను {పంచప్రాణములు - 1ప్రాణము 2అపానము 3సమానము 4ఉదానము 5వ్యానము}; నారాయణుండును = విష్ణుమూర్తి {నారాయణుడు - నారములందు పుట్టినవాడు, విష్ణువు}; చిత్తంబున్ = చిత్తమును; శ్వేతద్వీపపతియును = శ్రీహరి {శ్వేతద్వీపపతి - శ్వేతద్వీపవాసిని (లక్ష్మీదేవి) పతి (భర్త), విష్ణువు}; మనంబున్ = మనస్సును; యోగీశ్వరుండు = కపిలుడు {యోగీశ్వరుడు - యోగులలో ఈశ్వరుడు, కపిలావతారుడు, విష్ణువు}; ఐన = అయినట్టి;

కపిలుండును = కపిలుడు; బుద్ధినిన్ = మతిని; పృశ్నిగర్భుండును = విష్ణుమూర్తి {పృశ్నిగర్భుడు - పృశ్ని కుమారుడు, విష్ణువు}; అహంకారంబునన్ = అహంకారమునందు; భగవంతుండు = భగవంతుడు {భగవంతుడు - షడ్గుణైశ్వర్య సంపన్నుడు}; ఐన = అయిన; పరుండునున్ = పరబ్రహ్మ {పరుడు - పరాత్పరుడు, పరబ్రహ్మ, విష్ణువు}; పాలనంబునన్ = కాపాడుట; చేయుదురు = చేయుగాక; నీవున్ = నీవు; క్రీడించున్ = ఆడెడి; ఎడన్ = సమయములందు; గోవిందుడును = విష్ణుమూర్తి {గోవిందుడు - వేదవేది, విష్ణువు}; శయనించు = పరుండు; తఱిన్ = సమయము లందు; మాధవుండును = విష్ణుమూర్తి {మాధవుడు - లక్ష్మీపతి, విష్ణువు}; నడచున్ = నడచెడి; వేళన్ = అప్పుడు; వైకుంఠుండును = విష్ణుమూర్తి {వైకుంఠుడు - వైకుంఠము (మొక్కపోనిలోకము)నకు అధిపతి, విష్ణువు}; కూర్చున్న = కూర్చుండెడి; సమయంబునన్ = అప్పుడు; శ్రీపతియున్ = లక్ష్మీపతి; కుడుచున్ = తినెడి; కాలంబునన్ = అప్పుడు; సర్వభక్షకుండు = అన్నిటిని తినువాడు; అయిన = ఐనట్టి; యజ్ఞభుజుండున్ = విష్ణుమూర్తి {యజ్ఞభుజుడు - అన్ని హవిర్భాగములను (ఆయా దేవతా రూపములలో) తినువాడు, విష్ణువు}; ఏమఱకుండుదురు = అప్రమత్తులుగకాపాడుగాక; నిన్నున్ = నీ యొక్క; పేర్కొనిన = పేరుతలచినచో; దుస్వప్న = చెడ్డకలలు; వృద్ధ = వృద్ధగ్రహములు; బాలగ్రహంబున్ = బాలగ్రహములు; కూశ్మాండ = కూశ్మాండపిశాచములు; డాకినీ = డాకినీపిశాచములు; యాతుధానులును = రాక్షసపిశాచములు; భూత = భూతపిశాచములు; ప్రేత = ప్రేతపిశాచములు; యక్ష = యక్షులు; రాక్షస = రాక్షసులు; పిశాచ = పిశాచములు; వినాయకులున్ = వినాయక క్షుద్రదేవతలు; కోటరాదులు = కోటరీ ఆది పిశాచములు; జ్యేష్ఠ = జ్యేష్ఠదేవత; ఆది = మున్నగు; భూతనాథులునున్ = భూతాధిపతులు; మాతృక = మాతృక ఆది {మాతృక - ఎడమపక్క కొమ్ము చెవి మున్నగునవి కొరవడిన ఏనుగు, దీని వలన అధిపతికి దారిద్ర్యము కలుగును}; గణంబులును = గణదేవతలును; నశియింతురు = నశించిపోదురు; నీ = నీ; అందున్ = ఎడల; ప్రాణ = ప్రాణములకు; ఇంద్రియ = ఇంద్రియములకు; శరీర = దేహమునకు; నిరోధంబులు = ఇబ్బంది కలిగిచెడివి; ఐన = అయిన; ఉన్మాదంబులున్ = చిత్తాది చాంచల్యములు; అపస్మారంబులును = బుద్ధిభ్రమ కరణములు; మహా = గొప్ప; ఉత్పాతంబులును = ఆపదలను సూచించునవి; పొందకుండు = కలుగకుండు; కావుత = కాక; అని = అని; రక్షచేసి = రక్షకట్టి; దీవించిరి = ఆశీర్వదించిరి; అంత = అప్పుడు.

<u>భావము</u>:- గోపికలకు అంతటితో తృప్తి కలుగలేదు. అంగాంగాలకు మహారక్ష కట్టదలచి ఆచమనం చేశారు. బాలునకు రక్షకట్టే ముందు తమకు రక్షకోసం బీజన్యాసం

చేసుకొన్నారు. బాలునికి రక్ష కట్టడం మొదలు పెట్టారు. “చిన్ని తండ్రి! నీ పాదాలు బ్రహ్మ, మోకాళ్లు వాయువు, తొడలు యజ్ఞుడు, నడుము అచ్యుతుడు, కడుపు హయగ్రీవుడు, హృదయం కేశవుడు, వక్షస్థలము ఈశుడు, భుజాలు చతుర్భుజుడు, ముఖము త్రివిక్రముడు, శిరస్సు ఈశ్వరుడు రక్షిస్తారు. అంతేకాక, నీ ముందు చక్రధారి అయిన విష్ణువు, వెనుక గదాధారి అయిన శ్రీహరి, కుడి పక్క ధనుర్ధారి అయిన మధువైరి, ఎడమ పక్క ఖడ్గధరుడైన అజనుడు, కోణములలో శంఖ చక్ర గదా ధరుడైన ఉరుగాయుడు, మీద ఉపేంద్రుడు ఐన విష్ణువు, కింద గరుత్మంతుడు, అంతట హలధరుడు అయిన పురుషుడు రక్షిస్తారు. నీ ఇంద్రియాలు హృషీకేశుడు, ప్రాణాలు నారాయణుడు, చిత్తము శ్వేతద్వీపవతి, మనస్సు యోగీశ్వరుడైన కపిలుడు, బుద్ధి పృశ్నిగర్భుడైన విష్ణువు, అహంకారం భగవంతుడైన పరమపురుషుడు రక్షిస్తూ ఉంటారు. నీవు ఆడుతుండగా గోవిందుండు, నిద్రించేటప్పుడు మాధవుడు, నడిచేటప్పుడు వైకుంఠుండు, కూర్చొన్నప్పుడు శ్రీపతి, భుజిస్తున్నప్పుడు సర్వభక్షకుడైన యజ్ఞభుజుడు ఏమరుపాటు లేకుండా నిన్ను రక్షిస్తూ ఉంటారు. నీ పేరు పలికితే చాలు పీడ కలలు, వృద్ధగ్రహాలు, బాలగ్రహాలు, కూశ్మాండాలు, డాకినీ పిశాచాలు, యాతుధానులనే దుష్టశక్తులు, ప్రేత, యక్ష, రాక్షస, పిశచాదులు నశించిపోతాయి. గోటర, రేవత అనే దుష్టశక్తులు, జ్యేష్ఠదేవి, పూతన, మాతృకలు మొదలైన గణాలన్ని నాశనమై పోతాయి. నీ యందు ప్రాణాలను, ఇంద్రియాలను, శరీరాన్ని బాధించే ఉన్మాదాలు, మూర్ఛలు, మహోత్పాతాలు చేరకుండు గాక!” అని బాలుడికి రక్షపెట్టి దీవించారు.

10.1-237-క.

**ఆ పెద్ద వేడబంబుల**

**పాపనికిని జన్నుఁ గుడిపి, పానుపుపై సం**

**స్థాపించి, కప్పి, "కూరుకు**

**మో పాపఁడ!"యని యశోద యొయ్యనఁ బాడెన్.**

టీక:- ఆ = ఆ; పెద్ద = అధికమైన; పేడబంబుల = మాయలు కల; పాపని = పిల్లవాని; కిన్ = కి; చన్నున్ = స్తన్యమును; కుడిపి = తాగించి; పానుపు = పక్క, పడక; పైన్ = మీద; సంస్థాపించి = కుదురుకొల్పి, పడుకోబెట్టి; కప్పి = దుప్పటి కప్పి; కూరుకుము = నిద్ర పొమ్ము; ఓ = ఓయీ; పాపడ = పిల్లవాడ; అని = అని; యశోద = యశోద; ఒయ్యనన్ = తిన్నగా, వెంటనే; పాడెన్ = జోలపాడెను.

భావము:- ఆ పెను మాయల చంటి పాపడికి చనుబాలు పట్టి పానుపు మీద పరుండబెట్టారు "ఇక నిద్రపో నాయనా" అని యశోద జోల పాట పాడింది.

10.1-238-వ.

## అంత నందుండు మొదలయిన గోపకులు మథురనుండి వచ్చి, రక్కసి మేనుఁ గని, వెఱఁగుపడి, ‘‘మున్ను వసుదేవుం డుత్పాతంబు లెఱింగి చెప్పె; నతండు మహాయోగి” యని పొగిడి, కఠోరం బగు పూతన యొడలు గుఠారంబుల నఱకి, తమ కుటీరంబులకుం దవ్వగు ప్రదేశంబున పటీరంబుల దహనంబు, సంగ్రహించి దహించి; రంత.

టీక:- అంతన్ = అప్పుడు; నందుండు = నందుడు; మొదలయిన = మున్నగు; గోపకులు = యాదవులు; మథుర = మథురానగరము; నుండి = నుండి; వచ్చి = వచ్చి; రక్కసి = రాక్షసి యొక్క; మేనున్ = కళేబరమును; కని = చూసి; వెఱగుపడి = ఆశ్చర్యపోయి; మున్ను = ఇంతక్రితము; వసుదేవుండు = వసుదేవుడు; ఉత్పాతంబులున్ = గొప్పఆపదలను; ఎఱింగి = తెలిసికొని; చెప్పెను = హెచ్చరించెను; అతండు = అతను; మహా = గొప్ప; యోగి = ఋషి; అని = అని; పొగిడి = స్తుతించి; కఠోరంబులు = కఠినమైనది; అగు = ఐన; పూతన = పూతన యొక్క; ఒడలున్ = కళేబరమును; కుఠారంబులన్ = గొడ్డళ్ళతో; నఱకి = నరికేసి; తమ = వారి యొక్క; కుటీరంబుల = నివాసముల; కున్ = కు; దవ్వు = దూరముగా ఉండునది; అగు = ఐన; ప్రదేశంబునన్ = చోటు నందు; పటీరంబులన్ = గంధపుచెక్కలతో; దహనంబు = చితిని; సంగ్రహించి = పేర్చి; దహించిరి = కాల్చిరి; అంత = అప్పుడు.

భావము:- అప్పుడు నందుడు మొదలైన యాదవ నాయకులు మధురా నగరం నుండి వచ్చి, ఆ రాకాసి కళేబరాన్ని చూసి నివ్వెరపోయారు "వసుదేవుడు మహా యోగి

కనుక ఈ జరగబోయే ఉత్పాదాలు ముందే ఊహించి చెప్పాడు" అని మెచ్చుకొన్నారు. తరువాత కఠినమైన పూతన కళేబరాన్ని గొడ్డళ్ళతో నరికి ముక్కలు ముక్కలు చేసారు. తమ ఇళ్ళకు దూరంగా చందనం కట్టెలు పేర్చి ఆ కళేబరం ముక్కలు దహనం చేసారు.

10.1-239-ఆ.

పొగిలి పొగిలి, కాలు మగువదేహంబున
నగరు పరిమళముల పొగలు వెడలె;
దేహకల్మషములు శ్రీహరి ముఖమునఁ
ద్రావఁబడుటఁ జేసి, భూవరేణ్య!

టీక:- పొగిలిపొగిలి = మిక్కిలి రాజుకొని; కాలు = దహిస్తున్న; మగువ = స్త్రీ యొక్క; దేహంబునన్ = శరీరమునుండి; అగరు = అగరు సుగంధపు; పరిమళముల = సువాసనల; పొగలు = పొగలు; వెడలెన్ = వెలువడెను; దేహ = శారీరక; కల్మషములున్ = దోషములు, కుళ్ళు; శ్రీహరి = శ్రీకృష్ణుని యొక్క; ముఖమునన్ = నోటితో; త్రావబడుటన్ = తాగబడుట; చేసి = వలన; భూవరేణ్య = మహారాజ {భూవరేణ్యుడు - భూవరు (రాజులలో) వరేణ్యుడు (గొప్పవాడు), మహారాజు}.

భావము:- ఓ పరీక్షిత్తు మహారాజా! ఆ పూతన కళేబరం రగిలి రగిలి కాలుతుంటే అగరు సువాసనల పొగలు వెలువడ్డాయి. మరి విష్ణుమూర్తి ఆమె విషపు పాలతోపాటు ప్రాణాలే కాదు శరీరం లోని మాలిన్యాలన్నీ తాగేశాడు కదా.

10.1-240-క.

హరి దనమీఁదం బదములు
గరములు నిడి, చన్ను గుడిచి, కదిసినమాత్రన్
హరిజనని పగిదిఁ బరగతి
కరిగెను దురితములు బాసి యసురాంగనయున్.

టీక:- హరి = శ్రీకృష్ణుడు; తన = ఆమె; మీదన్ = పైన; పదములున్ = కాళ్ళు; కరములన్

= చేతులను; ఇడి = పెట్టి; చన్నున్ = చనుపాలు; కుడిచి = తాగి; కదిసిన = దగ్గరచేరిన; మాత్రన్ = మాత్రముచేత; హరి = విష్ణుమూర్తి; జనని = తల్లి; పగిదిన్ = వలె; పరగతి = పరమపదమున; కిన్ = కి; అరిగెను = వెళ్ళెను; దురితములున్ = పాపములు; పాసి = తొలగి; అసుర = రాక్షస; అంగన = స్త్రీ.

భావము:- అంతటి పాపిష్టి రాక్షసి, కృష్ణుడు తనపై కాళ్ళు చేతులు వేసి దగ్గరకు వచ్చి, చనుబాలు తాగినంత మాత్రాన పాపాలు అన్నీ పటాపంచలైపోయి, విష్ణువు తల్లి లాగ పరమగతికి వెళ్ళింది.

10.1-241-క.

వెన్నుని కొకమఱి విషమగు
చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్;
వెన్నునిఁ గని, పెంచుచుఁ దన
చన్నిచ్చిన సతికి మఱియు జన్మము గలదే?

టీక:- వెన్నుని = శ్రీకృష్ణుని; కిన్ = కి; ఒక = ఒకే ఒక్క; మఱి = సారి; విషమున్ = వ్యతిరిక్తమైనవి; అగు = ఐన; చన్నున్ = చనుపాలను; ఇచ్చినన్ = ఇవ్వగా; బాల = శిశు; హంత్రి = హంతకురాలు; చనెను = వెళ్ళినది; అట = అట; దివి = స్వర్గమున; కిన్ = కు; వెన్నుని = శ్రీకృష్ణుని; కని = పుట్టించి; పెంచుచున్ = పోషించుచు; తన = ఆమె యొక్క; చన్నున్ = చనుబాలను; ఇచ్చినన్ = ఇచ్చినట్టి; సతి = ఇల్లాలున; కిన్ = కు; మఱియున్ = మళ్ళీ; జన్మము = పుట్టుట; కలదే = కలుగునా, కలుగదు.

భావము:- విష్ణువుకు ఒక్కసారి విషపూరితమైన చనుబాలు ఇచ్చిన బాలహంతకురాలైన రాకాసి కూడ స్వర్గానికి వెళ్ళిందట. మరి ఇంక విష్ణుమూర్తిని కన్నతల్లికి, పాలిచ్చి పెంచిన తల్లికి మోక్షం తప్పక లభిస్తుంది కాని, మళ్ళీ జన్మ అన్నది ఉంటుందా?

10.1-242-క.

హరిఁ గని, చన్నులు గుడిపెడి

తరుణులు ప్రాపించు పదము తలఁపఁగ వశమే?

హరి యారగించుటకుఁ బా

ల్గురిసిన ధేనువులు ముక్తి కొనలఁ జరించున్.

టీక:- హరిన్ = శ్రీకృష్ణుని; కని = జన్మనిచ్చి; చన్నులు = చనుబాలు; కుడిపెడి = తాగించెడి; తరుణులున్ = ఇంతులు; ప్రాపించు = పొందెడి; పదము = స్థానము; తలపగన్ = ఊహించుట; వశమే = సాధ్యమా, కాదు; హరి = శ్రీకృష్ణుడు; ఆరగించుట = తాగుట; కున్ = కు; పాలు = పాలను; కురిసిన = సమృద్ధిగానిచ్చిన; ధేనువులు = ఆవులు; ముక్తి = మోక్షము; కొనలన్ = అంతమువరకు; చరించున్ = చేరుకొనును.

భావము:- చక్రిని కని చనుబాలు తాగించగలిగిన యువతులకు లభించే ఉత్తమలోకాలు ఊహించడం సాధ్యం కాదు. చక్రి తాగడానికి పాలను ఇచ్చిన గోవులు పరమపదం పొలిమేరలలో తిరుగు తుంటాయి.

10.1-243-క.

ఆ పూతన మెయిగంధము

గోపాలు రెఱింగి, "యిట్టి కువనిత యొడలం

దీపాటి స్వాదుగంధము

ప్రాపించునె"యనుచుఁ జనిరి పల్లెల కధిపా!

టీక:- ఆ = ఆ; పూతన = పూతన యొక్క; మెయి = దేహపు; గంధము = సువాసన; గోపాలురు = యాదవులు; ఎఱింగి = తెలిసికొని; ఇట్టి = ఇటువంటి; కు = చెడ్డ; వనిత = స్త్రీ; ఒడలున్ = దేహము; అందున్ = అందు; ఈపాటి = ఇంతటి; స్వాదు = మంచి; గంధము = సువాసన; ప్రాపించునె = పొందుతుందా, వింతకదా; అనుచున్ = అనుచు; చనిరి = వెళ్ళిరి; పల్లెలు = మందల; కున్ = కు; అధిపా = రాజా.

భావము:- ఆ పూతన కళేబరంనుంచి మంచి సువాసనలు రావడం గోపాలకులు గమనించారు. ఆశ్చర్యంతో "ఇంతటి దుష్టురాలి శరీరంలోంచి ఇంత చక్కటి సుగంధమా" అనుకొంటు తమతమ పల్లెలకి వెళ్లారు.

10.1-244-వ.

**అంత నందుండు పరమానందంబున నింటికిఁ జని, ప్రేతలచేత రక్కసిచేత లన్నియు నెఱంగి, వెఱఁగుపడి, పాపని లేపి, శిరంబు మూర్కొని, ముద్దాడి, ముదంబున నుండె;" నని చెప్పిన విని, పరీక్షిన్నరేంద్రుఁ డిట్లనియె.**

టీక:- అంతన్ = అప్పుడు; నందుండు = నందుడు; పరమానందంబునన్ = అత్యధిక సంతోషముతో; ఇంటి = నివాసమున; కిన్ = కు; చని = వెళ్ళి; ప్రేతల = గోపికల; చేతన్ = వలన; రక్కసి = రాక్షసస్త్రీ; చేతలు = చేష్టలు; అన్నియున్ = సమస్తమును; ఎఱింగి = తెలిసికొని; వెఱగుపడి = ఆశ్చర్యపోయి; పాపని = శిశువును; లేపి = పైకి తీసుకొని; శిరంబున్ = తలను; మూర్కొని = మూచూచి; ముద్దాడి = ముద్దుచేసి; ముదంబునన్ = సంతోషముతో; ఉండెను = ఉండెను; అని = అని; చెప్పిన = తెలియజెప్పిన; విని = విని; పరీక్షిత్ = పరీక్షిత్తు అనెడి; నరేంద్రుండు = మహారాజు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అంతటి ప్రమాదం తప్పిపోయినందుకు చాలా సంతోషంగా నందుడు ఇంటికి వెళ్ళాడు. గోపికలు పూతన చేష్టలు అన్ని చెప్పగా విని, ఆశ్చర్యపోయాడు. చంటిపిల్లాడిని లేపి శిరస్సు మూర్కొని ముద్దుపెట్టుకొన్నాడు. కొడుకుకి ఆపద తప్పినందుకు సంతోషించాడు." ఈ విధంగా శుకమహర్షి చెప్పగా పరీక్షిత్తు ఇలా అడిగాడు.

10.1-245-క.

"ఏయే యవతారంబుల

నే యే కర్మములు జేసె నీశుఁడు హరి; భ

ద్రాయతనము లన్నియు వినఁ

బాయదు చిత్తంబు; చెవులపండువు లయ్యెన్.

టీక:- ఏయే = ఎట్టి; అవతారంబువన్ = అవతారములందు; ఏయే = ఎట్టి; కర్మముల్ = పనులు; చేసెన్ = ఆచరించను; ఈశుడున్ = నారాయణుడు {ఈశుడు - ఈశత్వము (సర్వనియామకత్వము), కలవాడు, విష్ణువు}; హరి = నారాయణుడు; భద్రాయతనములు = మేలు కలిగించెడివి {భద్రాయతనములు - భద్రములు (మంగళముల) కి ఆయతనములు (ఇళ్ళు), మేలుకలిగించెడివి}; అన్నియున్ = అన్నింటిన; వినన్ = వినుటను; పాయదు = వదలదు; చిత్తంబున్ = మనస్సు; చెవులన్ = చెవులకి; పండువులు = ఆనందములు; అయ్యెన్ = కలిగెను.

భావము:- "భగవంతుడైన విష్ణుమూర్తి ఏయే అవతారాలలో ఏమేం పనులు చేసాడు. అవి విన్నవారిని రక్షిస్తాయి. నా మనస్సు వాటి మీదకు తప్పించి ఇంకో వాటి మీదకు పోదు. హరి చరిత్రలు వినడానికి చెవులకు పండుగలాగా ఉంటాయి.

10.1-246-క.

ఉరుసంసారపయోనిధి

తరణంబులు, పాపపుంజ దళనంబులు, శ్రీ

కరణంబులు, ముక్తి సమా

చరణంబులు, బాలకృష్ణు సంస్మరణంబుల్.

టీక:- ఉరు = గొప్ప; సంసార = సంసారము అనెడి; పయోనిధిన్ = సముద్రమును; తరణంబులు = దాటించునవి; పాప = పాపముల; పుంజ = సమూహములకు; దళనంబులు = ఖండించునవి; శ్రీ = శుభములను; కరణంబులు = కలిగించునవి; ముక్తి = మోక్షమును; సమ = చక్కగా; ఆచరణంబులు = సమకూర్చునవి; బాల = బాలునిగా ఉన్న; కృష్ణు = శ్రీకృష్ణుని;

సంస్మరణలు = మననము చేయుటలు.

<u>భావము</u>:- బాలకృష్ణుని గొప్ప పనుల స్మరణలు సంసారమనే మహా సముద్రాన్ని దాటించే నావలు. అవి పాపాల సమూహాలను పార తోలుతాయి, సకల సంపదలు సమకూరుస్తాయి, మోక్ష పదానికి మంచి మార్గాలు.

10.1-247-వ.

**అని “తరువాత బాలకృష్ణుం డేమి చేసె? నా యందుఁ గృపగలదేనిం జెప్పవే!” యని యడిగిన, రాజునకు శుకుం డిట్లనియె.**

<u>టీక</u>:- అని = అని; తరువాత = పిమ్మట; బాలకృష్ణుండు = బాలకృష్ణుడు; ఏమి = ఏమి; చేసెన్ = ఆచరించను; నా = నా; అందున్ = ఎడల; కృప = కరుణ; కలదేని = ఉన్నట్లయితే; చెప్పవే = చెప్పుము; అని = అని; అడిగిన = అర్థించినట్టి; రాజున్ = పరీక్షిత్తు; కున్ = కి; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

<u>భావము</u>:- నా మీద దయ ఉంటే ఆ తరువాత బాలకృష్ణుడు ఏమి చేసాడో చెప్పవలసినది” అని పరీక్షిత్తు అడుగగా, శుకబ్రహ్మ ఈ విధంగా చెప్పసాగాడు.

## యశోద కృష్ణుని తొట్లనిడుట

10.1-248-సీ.

బాలకుం డొదిగిలఁ బడనేర్చెనని జన్మ-

నక్షత్రమం దొకనాడు, నందు

పొలతి వేడుకతోడఁ బొరుగు ప్రేతలఁ జీరి-

వాదిత్రగీతారవంబు చెలఁగ

విప్రులతోఁగూడ వేదమంత్రంబుల-

నభిషేచనాదిక మాచరించి

వారి దీవెన లొంది వారికి మొదవులు-

నన్నంబు జీరల నడిగినట్టు

10.1-248.1-తే.

లిచ్చి బాలుఁ దియ్య మెసఁగఁ బానుపుఁ జేర్చి

నిదురపుచ్చి గోపనివహమునకు

గోపికలకుఁ బూజ గొమరారఁ జేయుచు

జనని కొడుకు మఱచె సంభ్రమమున.

**టీక:-** బాలకుండు = పసిపిల్లవాడు; ఒదిగిలబడన్ = బోర్లాపడుట; నేర్చెన్ = నేర్చుకొనెను; అని = అని; జన్మనక్షత్రమున్ = పుట్టిననక్షత్రము; అందున్ = వేళ; ఒక = ఒకానొక; నాడున్ = దినమున; నందు = నందుని; పొలతి = భార్య; వేడుక = వినోదకార్యపు సరదా; తోడన్ = తోటి; పొరుగు = పక్క ఇళ్ళ నుండెడి; ప్రేతలన్ = గోపికలను; చీరి = పిలిచి; వాదిత్ర = వాద్యముల యొక్క; గీతా = పాటల యొక్క; రవంబున్ = శబ్దములు; చెలగన్ = చెలరేగగా; విప్రుల్ = బ్రాహ్మణుల; తోన్ = తో; కూడ = కలిసి; వేద = వేదములందలి; అభిషేచన = అభిషేకము; ఆదికమున్ = మున్నగువానిని; ఆచరించి = చేసి; వారి = వారి యొక్క; దీవెనలున్ = దీవెనలను; ఒంది = పొంది; వారి = వారల; కిన్ = కి; మొదవులున్ = పాడియావులు;

అన్నంబున్ = అన్నము; చీరలున్ = వస్త్రములు; అడిగినట్టులు = ఎంత అడిగితే అంత; ఇచ్చి = దానములు చేసి.

బాలున్ = పిల్లవానిని; తియ్యమున్ = ప్రీతి; ఎసగన్ = అతిశయించగా; పాన్పుజేర్చి = పక్కపై పడుకోబెట్టి; నిదురబుచ్చి = నిదురపోవునట్లు చేసి; గోప = యాదవుల; నివహమున్ = సమూహమున; కున్ = కు; గోపికల = ప్రేతల; కున్ = కి; పూజన్ = గౌరవించుటలు; కొమరారన్ = చక్కగా; చేయుచున్ = చేస్తూండెడి; జనని = తల్లి; కొడుకున్ = బిడ్డని; మఱచెన్ = ఆదమరచెను; సంభ్రమమునన్ = పరాకువలన.

భావము:- యశోద ఒకనాడు బాలకృష్ణుడు ప్రక్కకు ఒత్తిగిల్లి, బోర్లపడడం నేర్చుకున్నాడు అని వేడుక చేసింది. ఆవేళ బాలకుని జన్మనక్షత్రం. ముచ్చటతో గోపికలను అందరినీ పేరంటానికి పిలిచింది. మంగళవాద్యాలు మ్రోగుతుండగా బ్రాహ్మణులచేత వేదమంత్రాలతో అభిషేకం చేయించింది. బ్రాహ్మణుల దీవెనలు గ్రహించి, వారికి ఆహార ధాన్యాలు గోవులు క్రొత్త బట్టలు అడిగినవి అడిగినట్లు దానం చేసి, తరువాత బాలకృష్ణుణ్ణి పాన్పుపై పడుకోబెట్టి నిదురపుచ్చింది. వృద్ధు లైన గోపికలకు గోపకులకు గౌరవాలు చేస్తూ, ఆ సందడిలో పిల్లవాడి విషయం మరచిపోయింది.

## కృష్ణుడు శకటము దన్నుట

10.1-249-వ.

ఆ సమయంబున.

టీక:- ఆ = ఆ; సమయంబునన్ = సమయము నందు.

భావము:- శైశవ కృష్ణుడు బోర్లా పడ్డాడు. యశోదాదేవి పండుగ జేస్తున్నది. గోపకులను గౌరవించే హడావిడిలో, చంటిపిల్లడిని ప్రీతిగా పాన్పు మీద నిద్రపోగొట్టింది. పనులలో మునిగిపోయింది. అప్పుడు. .

10.1-250-క.

నిదురించిన శిశు వాకొని

కిదుకుచుఁ జనుఁ గోరి కెరలి కిసలయ విలస

న్మృదు చక్రచాపరేఖా

స్పద పదమునఁ దన్నె నొక్క బండిన్ దండిన్.

టీక:- నిదురించిన = నిద్రపోయిన; శిశువు = పసిపిల్లవాడు; ఆకొని = ఆకలివేసి; కిదుకుచున్ = ఒళ్ళు విరుచుకొనుచు; చనున్ = చనుబాలు; కోరి = కోరి; కెరలి = విజృంభించి; కిసలయ = చిగురుటాకు; విలసత్ = వంటి విలాసము కల; మృదు = మృదువైన, మెత్తనైన; చక్ర = చక్రము; చాప = విల్లు; రేఖా = రేఖలు; ఆస్పద = ఉనికిపట్టైన, ఉన్న; పదమునన్ = కాలితో; తన్నెన్ = తన్నెను, కాలితోకొట్టెను; ఒక్క = ఒకానొక; బండిన్ = బండిని; దండిన్ = గట్టిగా.

భావము:- అలా నిద్రనటిస్తున్న చంటిపిల్లాడుగా ఉన్న శ్రీకృష్ణునికి ఆకలి వేసింది. పాలకోసం ఒళ్ళు విరుచుకుంటు కాళ్ళు చేతులు ఆడిస్తున్నాడు. ఆ పాదాలు మామూలువా, కాదు చక్రం చాపం మున్నగు శుభరేఖలతో అలరారేవి. అట్టి పాదంతో ఒక బండిని గట్టిగా తన్నాడు.

కృష్ణుడు షడ్భావ శూన్యుడు, షడూర్మి శూన్యుడు. అయినను నిద్ర నటిస్తున్నాడు. లోకవిడంబనార్థం తల్లిపాలు తాగాలని చూస్తున్నట్లు నటిస్తున్నాడు. స్తన్యం ఇచ్చేవారు

లేరని కోపం వచ్చి, కాలుతో శకటాన్ని తన్నాడు. శకటం అంటే మానవ శరీరం. అసురుడు అంటే అమానుష తత్త్వము ధరించి నిద్రా సంగమాదులలో మునిగితేలు మూర్ఖుడు. భోగవాంఛలు బండిలోని వస్తువులు. వాని వలన సంసారసాగరంలో పడుతున్నాడు. వాటిని పరిత్యజించా లని బండిని తన్నటం. ఆ తన్నిన పాదం విశ్వాన్ని నడిపే చక్రం శాసించే చాపం తానైన పరమాత్మ. పరిత్యజించటానికైనా భగవానుని అనుగ్రహం కావాలి కనుక భక్తి ముఖ్యం అని అనుకోవచ్చు. [ఆధారం శ్రీ పాలపర్తి నాగేశ్వర్లు శాస్త్రులు గారి శ్రీమదాంధ్రభాగవత గ్రంథం. ఆ పండితోత్తమునికి కృతజ్ఞతా పూర్వక ప్రణామ శతాలు]

10.1-251-క.

**శకటము హరి దన్నిన దివి**

**బ్రకటం బై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్**

**వికటంబుగ నేలంబడె**

**నకటా! యని గోపబృంద మాశ్చర్యపడన్.**

**టీక:-** శకటమున్ = బండిని; హరి = బాలకృష్ణుడు; తన్నినన్ = తన్నగా; దివిన్ = ఆకాశముమీదికి; ప్రకటంబున్ = బాగా కనబడునది; ఐ = అయ్యి; ఎగసి = ఎగిరి; ఇరుసున్ = ఇరుసుపైపడిన {ఇరుసు – చక్రము తిరుగనాధార మైన గుండ్రటి కమ్మి}; భరమునన్ = బరువువలన; కండ్లున్ = కండిలు {కండి - ఇరుసుపై తిరిగెడి మధ్య రంధ్రముగల గుండ్రముగానుండి ఆకులుద్వారా చక్రమునకు కలపబడి యుండెడిది}; వికటంబుగన్ = ఆకులు విరిగి విడిపోయి; నేలన్ = నేలమీద; పడెన్ = పడిపోయెను; అకటా = అయ్యో; అని = అని; గోప = గోపకుల; బృందము = సమూహము; ఆశ్చర్యపడన్ = ఆశ్చర్యపోగా.

**భావము:-** అలా బాలకృష్ణుడు బండిని తన్నగా, అది ఆకాశం అంత ఎత్తు ఎగిరింది. ఇరుసు బరువుకి చక్రాల కండ్లు నేలమీద ముక్కలుముక్కలై పడ్డాయి. అక్కడున్న గోపకులు ఆశ్చర్యపోయారు.

శకటము మానవ దేహానికి గుర్తు. హరి బ్రహ్మజ్ఞానం తన్నటం తాకటం అంటే స్పర్శ కలిగింది. నడిపిన నడిపించిన పుణ్యాల ఫలంతో స్వర్గ ప్రాప్తి కలిగింది (ఆకాశాని

కెగసింది). ఇరుసు (సంచితాది కర్మలు) బరువుకి కండ్లు అంటే (కర్మ వాసనలు) తో ఛిన్నాభిన్నము అయ్యి నేలమీద పడెను. అంటే పుణ్యకర్మ ఫలము కరిగిపోయి మర్త్యలోకంలో పడి పునర్జన్మ పొందును. గోపకులు జ్ఞానపేక్షకులు /ముముక్షువులు. [ఆధారం శ్రీ పాలపర్తి నాగేశ్వర్లు శాస్త్రులు గారి శ్రీమదాంధ్రభాగవత గ్రంథం. వారికి వందనాలు]

10.1-252-వ.

**అప్పు డందున్న సరసపదార్థంబులు వ్యర్థంబులై నేలంగూలుటం జూచి యశోదానంద ముఖ్యులైన గోపగోపికాజనంబులు పనులు మఱచి పబ్బంబులు మాని యుబ్బుచెడి వెఱపులు ఘనంబులుగ మనంబులందుఁ గదుర.**

**<u>టీక</u>:-** అప్పుడు = ఆ సమయము నందు; అందున్ = దానిలో; ఉన్న = ఉన్నట్టి; సరస = మంచి, రసవంతములైన; పదార్థంబులున్ = వస్తువులు; వ్యర్థంబులు = ప్రయోజనము లేనివి; ఐ = అయ్యి; నేలన్ = నేలమీద; కూలుటన్ = పడిపోవుటను; చూచి = చూసి; యశోద = యశోద మఱియు; నంద = నందుడు; ముఖ్యులు = మున్నగు ముఖ్యులు; ఐన = అయిన; గోప = గోపకులు; గోపికా = గోపికలైన; జనంబులున్ = వారు; పనులున్ = చేస్తున్న పను లందు; మఱచి = విస్మృతి చెంది; పబ్బంబులున్ = వేడుకలను; మాని = వదలిపెట్టి; ఉబ్బు = ఉత్సాహములు; చెడి = లేనివారై; వెఱపులు = భయములు; ఘనంబులుగా = మిక్కిలి అధికముగ; మనంబులన్ = మనసు లందు; కదుర = పుట్టగా.

**<u>భావము</u>:-** బాలకృష్ణుని తన్నుకు బండి ఎగిసి పడింది. దానిలోని రసవంతమైన పదార్థాలు వ్యర్థాలు అయ్యి నేలపాలయ్యాయి. అప్పుడది చూసి, యశోద, నందుడు మున్నగు గోపీ గోపకులు సంభ్రమంతో చేస్తున్న పనులు మరచారు. వేడుకలు మానారు. ఉత్సాహాలు నశించి మిక్కిలి బెదరసాగారు.

10.1-253-క.

"మిన్నున కూరక నెగయదు

తన్న సమర్థుండు గాఁడు తల్పగతుం డీ

చిన్నికుమారుఁడు తేరే

విన్ననువున నెగసె దీని విధ మెట్టిదియో."

టీక:- మిన్నునన్ = పైకి; ఊరకన్ = కారణము లేకుండగ; ఎగయదు = ఎగరజాలదు; తన్నన్ = తన్నుటకు; సమర్థుండు = శక్తిగలవాడు; కాడు = కాడు; తల్పగతుడు = పక్కమీంచి లేవలేనివాడు; ఈ = ఈ; చిన్ని = చంటి; కుమారుడు = పిల్లవాడు; తేరు = బండి; ఏ = ఏ; విన్ననువునన్ = విధముగ, యత్నముచే; ఎగసెన్ = ఎగిరినది; దీని = ఇది జరిగిన; విధము = విధానము; ఎట్టిదియో = ఏమిటో.

భావము:- “ఉత్తినే కారణం లేకుండా బండి ఎగరదు కదా. మరి ఈ చంటి పిల్లాడు కృష్ణుడు అంతటి పనికి చాలినవాడు కాదు. పక్కమీంచి లేవనైన లేవలేడు. మరి బండి ఎలా ఎగిరిపడింది” అనుకుంటు గోపగోపికాజనాలు విచారించసాగారు.

10.1-254-వ.

అని వితర్కించు సమయంబున

టీక:- అని = అని; వితర్కించు = యోచించెడి; సమయంబునన్ = సమయము నందు.

భావము:- బండి ఎలా ఎగిరి పడిందని గోపగోపికలు యోచించుకుంటున్నారు. అప్పుడు.

10.1-255-క.

"**బాల**కుఁ డాకొని యేడ్చుచు

గా **లె**త్తినఁ దాఁకి యెగసెఁ గాని శకట మే

మూ**ల**మున నెగయ"దని య

బ్బా**లు**ని కడ నాడుచుండి పలికిరి శిశువుల్.

**టీక:-** బాలకుడు = పిల్లవాడు; ఆకొని = ఆకలివేసి; ఏడ్చుచుచున్ = ఏడుస్తూ; కాలున్ = కాలు; ఎత్తినన్ = ఎత్తగా; తాకి = తగిలి; ఎగసెన్ = ఎగిరినది; కాని = తప్పించి; శకటము = బండి; ఏ = మరింకే విధమైన; మూలమునన్ = కారణముచేతను; ఎగయదు = ఎగరలేదు; అని = అని; తత్ = ఆ; బాలుని = పిల్లవాని; కడన్ = వద్ద; ఆడుచుండి = ఆటలాడుకొనుచు; పలికిరి = చెప్పిరి; శిశువులు = చిన్నపిల్లలు.

**భావము:-** అక్కడ ఆడుకుంటున్న పిల్లలు ఇలా చెప్పారు. “పక్కమీద పడుకున్న చంటిపిల్లాడు హరి ఆకలేసి ఏడుస్తూ కాలు జాడించాడు. కాలు తగిలి బండి ఎగిరిపడింది. అంతే గాని మరో కారణం కాదు.”

10.1-256-వ.

ఇట్లు శిశువులు పలికిన పలుకులు విని.

**టీక:-** ఇట్లు = ఈ విధముగ; శిశువులు = పిల్లలు; పలికిన = చెప్పుచున్నట్టి; పలుకులు = మాటలు; విని = విని.

**భావము:-** ఇలా కృష్ణునిలు తాకిడికి బండి ఎగిరిందని చెప్పిన పిల్లల మాటలు విని.

10.1-257-శా.

"**బాలుం** డెక్కడ? బండి యెక్కడ? నభోభాగంబుపైఁ జేడ్పడం

గా**లం** దన్నుట యెక్క? డేల పడుచుల్ గల్లాడి? రీ జడ్డు ప

ల్కే **లో**కంబున నైనఁ జెప్పఁబడునే? యే చందమో కాక" యం

చా**లా**పించుచుఁ బ్రేలు ప్రేతలు ప్రభూతాశ్చర్యలై రంతటన్.

టీక:- బాలుండు = పిల్లవాడు; ఎక్కడ = ఎక్కడ; బండి = బండి; ఎక్కడ = ఎక్కడ; నభోభాగంబు = ఆకాశము; పైన్ = మీదికి; చేద్పడన్ = వికల మగునట్లుగా; కాలన్ = కాలితో; తన్నుట = తన్నడము; ఎక్కడన్ = ఎక్కడ; ఏలన్ = ఎందుకని; పడుచుల్ = పిల్లలు; కల్లలు = అబద్ధములు; ఆడిరి = పలికిరి; ఈ = ఇలాంటి; జడ్డు = తెలివిమాలిన; పల్కు = మాటలు; ఏ = ఏ; లోకంబునన్ = లోకములో; ఐనన్ = అయినప్పటికి; చెప్పబడునే = వినబడుతుందా; ఏ = ఎలాంటి; చందమో = హేతువో; కాక = కాని; అంచున్ = అనుచు; ఆలపించుచున్ = మాటలాడుకొనుచు; ప్రేలు = తపించునట్టి; వ్రేతలు = గోపికలు; ప్రభూత = పుట్టిన; ఆశ్చర్యలు = ఆశ్చర్యములు కలవారు; ఐరి = అయినారు; అంతటన్ = అటుపిమ్మట.

భావము:- అప్పుడు గోపికాగోపజనులు ఎంతో ఆశ్చర్యపోతూ ఇలా అనుకోసాగారు "ఇంత చంటిపిల్లా డేమిటి? ఇంత పెద్ద బండిని కాలుతో తన్నటం ఏమిటి? అది వెళ్ళి ఆకాశం అంత ఎత్తు ఎగరటం ఏమిటి? కుఱ్ఱాళ్ళు ఇలా ఎందుకు చెప్తున్నారో, ఏమిటో కాని. స్వర్గ మర్త్య పాతాళాలనే ముల్లోకాలలో ఎక్కడైనా ఎవరైనా ఇలాంటి అసంబద్ధాలు మాట్లాడారా? లేదు లేదు, దీనికి వేరే హేతువేదో ఉండవచ్చు"

10.1-258-వ.

అప్పుడా బాలుని రోదనంబు విని యశోద పఱతెంచి.

టీక:- అప్పుడు = ఆ సమయము నందు; ఆ = ఆ; బాలుని = పిల్లవాని; రోదనంబు = ఏడుపు; విని = విని; యశోద = యశోద; పఱతెంచి = పరుగెట్టుకొని వచ్చి.

భావము:- ఇలా శకటాసుర సంహారం చేసిన లీలా బాలకుడు కృష్ణుని ఏడుపు విని యశోద పరుగెట్టుకొని వచ్చింది.

10.1-259-ఆ.

"అలసితివి గదన్న! యాకొంటివి గదన్న!

మంచి యన్న! యేడ్వ మాను మన్న!

చన్నుఁగుడువు మన్న! సంతసపడు మన్న!"

యనుచుఁ జన్నుఁగుడిపె నర్భకునకు.

**టీక:-** అలసితివి = అలసిపోయావు; కద = కదా; అన్న = నాయనా; ఆకొంటివి = ఆకలివేసినది; కద = కదా; అన్న = నాయనా; మంచి = బుద్ధిమంతుడివి; అన్న = నాయనా; ఏడ్పున్ = రోదనమును; మానుము = మానివేయుము; అన్న = నాయనా; చన్ను = చనుబాలు; కుడువుము = తాగుము; అన్న = నాయనా; సంతసపడుము = సంతోషింపుము; అన్న = నాయనా; అనుచున్ = అంటూ; చన్నున్ = చనుబాలు; కుడిపెన్ = తాగించెను; అర్భకున్ = పిల్లవాని; కున్ = కి.

**భావము:-** ఓ నా చిన్ని కన్నా! అలసిపోయావా నాయనా! ఆకలేస్తోందా కన్నా! మంచి వాడివి కదా కన్నా! ఏడుపు ఇక ఆపు నాయనా! దా పాలు తాగి చిరునవ్వులు చిందించు కన్నా! అంటు లాలిస్తూ యశోదాదేవి పాలిచ్చింది బిడ్డడికి.

10.1-260-వ.

**అంత నబ్బాలునిమేన బాలగ్రహంబు సోఁకునుగదా యని శంకించి గోపకు లనేకు లనేక బలి విధానంబులు చేసిరి; బ్రాహ్మణులు దధికుశాక్షతంబుల హోమంబు లాచరించిరి; ఋగ్యజు స్సామ మంత్రంబుల నభిషేచనంబులు చేయించి స్వస్తి పుణ్యాహవాచనంబులు చదివించి కొడుకున కభ్యుదయార్థంబు నందుం డలంకరించిన పాఁడిమొదవుల విద్వజ్జనంబుల కిచ్చి వారల యాశీర్వాదంబులు గైకొని ప్రమోదించె" నని చెప్పి శుకుం డిట్లనియె.**

**టీక:-** అంతన్ = అప్పుడు; ఆ = ఆ; బాలుని = పిల్లవాని; మేనన్ = దేహమునందు; బాలగ్రహంబు = పిల్లల పిశాచము; సోకునుకదా = పట్టవచ్చును; అని = అని; శంకించి = సందేహించి; గోపకులు = గొల్లలు; అనేకులు = చాలామంది; అనేక = బహువిధముల; బలి = బలులు ఇచ్చెడి; విధానంబులు = కార్యక్రమములు; చేసిరి = చేసారు; బ్రాహ్మణులు = విప్రులు; దధి = పెరుగు; కుశ = దర్భలు; అక్షతంబుల = అక్షతలు {అక్షతలు - క్షతము (బాధ) లేనివి}; హోమంబులు = హోమములను; ఆచరించిరి = చేసిరి; ఋగ్యజుస్సామ = వేదత్రయమునకు చెందిన; మంత్రంబులన్ = మంత్రములతో; అభిషేచనంబు = అభిషేకములు; చేయించి =

చేయించి; స్వస్తిపుణ్యాహ = శుభప్రద మైన; వచనంబులు = మంత్రములను; చదివించి = పఠింపజేసి; కొడుకున్ = పుత్రున; కున్ = కు; అభ్యుదయ = మేలు కలుగుట; అర్థంబున్ = కోసము; నందుండు = నందుడు; అలంకరించిన = ఆభరణాదు లిడిన; పాడి = పాలిచ్చెడి; మొదవులన్ = పశువులను; విద్వత్ = విద్వాంసులైన; జనంబుల్ = వారి; కిన్ = కి; ఇచ్చి = దానములు చేసి; వారల = వారి యొక్క; ఆశీర్వాదంబులున్ = దీవెనలను; కైకొని = స్వీకరించి; ప్రమోదించెను = ఆనందించెను; అని = అని; చెప్పి = తెలిపి; శుకుండు = శుకుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

**భావము:-** బాల కృష్ణుడు శకటాసుర సంహారం చేసిన తరువాత, అనేకమంది గోపకులు పిల్లాడికి బాలగ్రహం సోకిందేమో అని అనేక రకాల శాంతులు బలులు చేసారు. బ్రాహ్మణులు పెరుగు, దర్భలు, అక్షంతలు దిష్టి తీసి హోమంలో వేసారు. వేదమంత్రాలతో ఆశీర్వచనాలు పలికారు. పుణ్యాహవచనాలు చదివారు. నందుడు కుమారుని అభ్యుదయం కోసం అలంకరించిన పాడి ఆవులను పండితులకు దానం చేసాడు. వారి ఆశీర్వాదములు తీసుకుని ఆనందించాడు. అంటు శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పసాగాడు.

10.1-261-క.

"కొ**డు**కు నొకనాడు తొడపై
ని**డు**కొని ముద్దాడి తల్లి యెలమి నివురుచోఁ
గ**డు**దొడ్డ కొండ శిఖరము
వ**డు**వున ప్రేఁ గయ్యె నతఁడు వసుధాధీశా!

**టీక:-** కొడుకున్ = కుమారుడు; ఒక = ఒకానొక; నాడు = దినమున; తొడ = ఒడి; పైన్ = అందు; ఇడుకొని = పెట్టుకొని; ముద్దాడి = ముద్దులు పెట్టి; తల్లి = తల్లి; ఎలమిన్ = ప్రేమతో; నివురుచోన్ = దేహముపై రాయుచుండగా; కడు = మిక్కిలి; దొడ్డ = పెద్ద; కొండ = కొండ యొక్క; శిఖరము = శిఖరము; వడువునన్ = వలె; ప్రేగు = బరువెక్కినవాడు; అయ్యెన్ = అయిపోయెను; అతడు = అతను; వసుధాధీశ = రాజా.

**భావము:-** ఓ మహారాజా! పరీక్షిత్తు! తల్లి యశోదాదేవి, ఒకరోజు పాపడిని ఒళ్ళో

కూర్చుండబెట్టుకొంది. ముద్దులు పెట్టి లాలించి ఒడలు నిమురుతోంది. ఇంతలో ఆ యశోదా కృష్ణుడు చటుక్కున పెద్ద కొండరాయి అంత బరువెక్కి పోసాగాడు.

10.1-262-క.

**బరువైన కొడుకు మోవను**

**వెరవిఁడి యిలమీఁదఁ బెట్టి వెఱచి జనని దా**

**"ధరఁ గావఁ బుట్టిన మహా**

**పురుషుఁడు గాఁబోలు" ననుచు బుద్ధిఁ దలంచెన్.**

**టీక:-** బరువైన = బరువెక్కినట్టి; కొడుకున్ = పుత్రుని; మోవను = మోయుటకు; వెరవిడి = భయపడి; ఇల = భూమి; మీదన్ = పైన; పెట్టి = ఉంచి; వెఱచి = బెదిరి; జనని = తల్లి; తాన్ = అతను; ధరన్ = భూమిని; కావన్ = కాపాడుటకు; పుట్టిన = జన్మించిన; మహా = గొప్ప; పురుషుడు = యత్నశీలి; కాబోలున్ = అయి ఉండవచ్చును; అనుచున్ = అనుకొని; బుద్ధిన్ = మనసున; తలంచెన్ = భావించెను.

**భావము:-** అలా యశోద తొడలమీది కొడుకు బరువెక్కిపోతుంటే, ఇంత బరువుగా ఉన్న కొడుకును మోయలేక నేలమీద పడుకోబెట్టింది. బెదిరిపోతు తల్లి యశోద మనసులో ఇతగాడు లోకాన్ని కాపాడటానికి వచ్చిన కారణజన్ముడేమో అనుకుంది. అవును మరి సాధారణ పిల్లాడు కాదు కదా, లీలామాణవబాలకుడు కదా. అది గ్రహింపు అయినప్పటికి, వెంటనే మాయ కమ్మేసిందేమో. లేకపోతే నేలమీద పెడుతుందా కారణజన్ముని అని సందేహం.

## తృణావర్తుడు కొనిపోవుట

10.1-263-వ.

**అప్పుడు.**

**టీక:-** అప్పుడు = ఆ సమయము నందు.

భావము:- అప్పుడు అలా బరువెక్కిన చంటిపిల్లవానిని తల్లి కింద పెట్టి వెళ్ళినప్పుడు.

10.1-264-క.

**ఖరుఁ డగు కంసుని పంపున**

**నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగాఁ**

**సురకరువలి యై బిసబిస**

**నరు దరు దన ముసరి విసరి హరిఁ గొనిపోయెన్.**

టీక:- ఖరుడు = కఠినుడు; అగు = ఐన; కంసుని = కంసుని యొక్క; పంపునన్ = ఆజ్ఞానుసారము; అరిగి = వెళ్ళి; తృణావర్తుడు = తృణావర్తుడను రాక్షసుడు; అవని = లోకుల; కిన్ = కి; అవచాటముగా = అకస్మాత్తుగా; సురకరువలి = సుడిగాలి {సురకరువలి – వ్యు. సుర (పెను) కరువలి (వాయువు), పెనుగాలి, సుడిగాలి}; ఐ = అయ్యి; బిసబిస = వేగముగా; అరుదు = వింతలలో, అశక్యములలో; అరుదు = వింత, అపూర్వము; అనన్ = అనుచుండగ; ముసరి = ఆవరించి; విసిరి = బలంగావీచి; హరిన్ = కృష్ణుని; కొనిపోయెన్ = తీసుకుపోయెను.

భావము:- కఠినాత్ముడైన కంసుడు పంపిన తృణావర్తుడనే రాక్షసుడు అకస్మాత్తు నేల మీదకి వచ్చాడు. ఆ రావటం రావటం సుడిగాలి రూపంలో “రయ్” “రయ్” మంటు అందరు ఆశ్చర్యపోయేలా మిక్కిలి వడితో కమ్ముకుంటు వచ్చి, ఒక్క విసురుతో కృష్ణబాలకుని పైకి ఎత్తుకుపోయాడు.

10.1-265-క.

**సుడి యెఱుఁగని హరి సుడివడ**

**సుడిగాలి తెఱంగు రక్కసుఁడు విసరెడి యా**

**సుడిగాలి ధూళి గన్నుల**

**సుడిసిన గోపకులు బెగడి సుడివడి రధిపా!**

టీక:- సుడి = చలింపజేయబడుట అన్నది; ఎఱుగని = తెలియని; హరిన్ = విష్ణుమూర్తి;

సుడివడన్ = చుట్టబెట్టికొనిపోవలె నని; సుడిగాలి = సుడిగాలి; తెఱంగు = వంటి; రక్కసుండు = రాక్షసుడు; విసరెడి = బలంగా వీస్తున్న; ఆ = ఆ; సుడిగాలి = సుడిగాలి యొక్క; ధూళిన్ = దుమ్ము; కన్నులన్ = కళ్ళలో; సుడిసినన్ = చుట్టుముట్టగా; గోపకులు = యాదవులు; బెగడి = భయపడిపోయి; సుడువడిరి = చుట్టచుట్టుకుపోయిరి; అధిపా = రాజా.

<u>భావము</u>:- కష్టం అంటే తెలియని చంటిపిల్లాడు కృష్ణుడుని చిక్కుపడేయాలని తృణావర్తుడనే రాక్షసుడు సుడిగాలి రేపాడు. ఆ విసురుకి లేస్తున్న దుమ్ముకు కళ్ళు కమ్ముకోగా గోపకులు బెదిరి గాబరా పడ్డారు.
సుడి సుడి అని ఏడుసార్లు ప్రయోగించి. ఎంతో చమత్కారం చూపారు పోతన్న గారు.

10.1-266-వ.

**మఱియు న వ్వలయపవన దనుజుండు విలయపవనుని తెఱంగునం గసిమసంగి ముసరి మసరుకవిసి విసిరెడి సురకరువలిం బొడమిన పుడమిరజంబు వడి నెగసి గగనమున మెఱసి తరణి కిరణములకు మఱుఁగుపడిన నిబిడ మగు బెడిదంపు తిమిరమున దశదిశ లెఱుంగఁబడక గోకులం బాకులంబు నొంద నొండొరుల నెఱుంగక బెండుపడుచున్న జనంబుల మనంబుల ఘనంబగు భయంబు రయంబునం జెంద నదభ్రపరిభ్రమణ శబ్దంబున దిగంతంబులు చెవుడుపడి పరిభ్రాంతంబులుగ నొక్క ముహూర్తమాత్రంబున భువన భయంకరత్వంబు దోఁచె; నా సమయంబున.**

<u>టీక</u>:- మఱియున్ = ఇంకను; మలయపవన = పైరగాలివంటి తృణావర్త; దనుజుండు = రాక్షసుడు; విలయ = ప్రళయకాలపు; పవను = వాయువుల; తెఱంగు = వలె; కసిమసంగి = రేగి; ముసరి = చుట్టుముట్టి; ముసరుకవిసి = ఆక్రమించి; విసిరెడి = వీచెడి; సురకరువలిన్ = సుడిగాలిని; పొడమినన్ = చూపట్టిన; పుడమి = నేలమీది; రజంబున్ = ధూళి; వడిన్ = వేగముగా; ఎగసి = ఎగిరివచ్చి; గగనమునన్ = ఆకాశమున; మెఱసి = అతిశయించి; తరణి = సూర్యుని; కిరణముల = కిరణముల; కున్ = కు; మఱుగుపడిన = కనబడకుండ చేసిన;

నిబిడము = దట్టమైనది; అగు = ఐన; బెడిదంపు = భయంకరమైన; తిమిరమునన్ = చీకటి యందు; దశదిశలు = దిక్కు {దశదిశలు - దిక్కులు4 (1తూర్పు 2దక్షిణము 3పడమర 4ఉత్తరము) మూలలు4 (1ఈశాన్యము 2ఆగ్నేయము 3నైరృతి 4వాయవ్యము) మరియు పైనకింద2}; ఎఱుంగబడక = తోచక; గోకులంబున్ = వ్రేపల్లె; ఆకులంబున = కలతను; ఒందన్ = పొందగా; ఒండొరులన్ = ఒకరి నొకరు; ఎఱుంగక = చూడలేక; బెండుపడుచున్న = నిశ్చేష్టులు అగుచున్న; జనంబుల = వారి; మనంబులన్ = మనసు లందు; ఘనంబు = అత్యధికమైనది; అగు = ఐన; భయంబు = భయములు; రయంబునన్ = శీఘ్రముగ; చెందెన్ = కలిగినవి; అదభ్ర = తక్కువకాని, అధికమైన; పరిభ్రమణ = తిరుగటవలని; శబ్దంబునన్ = ధ్వనిచేత; దిగంతంబులున్ = దిక్కుల కడలను కూడ; చెవుడుపడి = చెవులు గళ్ళుపడి; పరిభ్రాంతంబులు = మిక్కిలి భ్రాంతిచెందినవారు; కన్ = అయిపోగ; ఒక్క = ఒకే ఒక; ముహూర్త = ముహూర్తపు; మాత్రంబునన్ = కాలములోనే; భువన = లోకములకు; భయంకరంబున్ = భీతిగొల్పెడిదిగా; తోచెన్ = కనబడెను; ఆ = ఆ; సమయంబునన్ = సమయము నందు.

<u>**భావము**</u>:- ఆ సుడిగాలి రాక్షసుడు ప్రళయకాల ప్రభంజనం వలె విజృంభించి రివ్వురివ్వున విసిరికొట్టాడు. ఆ గాలినుండి పుట్టిన దుమ్ము ధూళి ఉవ్వెత్తుగా లేచింది. ఆ ధూళి ఆకాశమంతా ఆవరించి సూర్యుని కిరణాలకు అడ్డుపడింది. అప్పుడు భయంకరమైన చీకటి ఆకాశమంతా దట్టంగా ఆవరించింది. గోపకులు దిక్కు తెలియక అల్లాడిపోయారు, ఎవ రెక్కడ ఉన్నారో తెలియకుండ పోయింది. దానితో నిశ్చేష్టులైన వారి కందరికి గొప్పభయం పుట్టి మనస్సుల నిండా నిండిపోయింది. ఆ సుడిగాలి వేగానికి ఆ భయంకర ధ్వనికి దిక్కులు దద్దరిల్లాయి. జగమంత గిఱ్ఱున తిరుగుతున్నట్లు తోచింది. అలా ఒక్క ముహూర్తం పాటు లోకా లన్నిటికి భయంకరమైన స్థితి ఏర్పడింది.
కసిమసగు, ముసురు, మసరుకవియు, చెవుడుపడు వంటి జాతీయాలు ప్రయోగం వచనానికి ఎంతో అందాన్నిచ్చాయి.

10.1-267-ఉ.

పాపనిఁ జూడఁ గానక విపద్దశ నొంది కలంగి తల్లి "యో

పాపఁడ! బాలసూర్యనిభ! బాలశిరోమణి! నేడు గాలికిం

జేపడిపోయితే"యనుచుఁ జీరుచు దైవముఁ జాల దూఱుచుం

దాపము నొంది నెవ్వగల డయ్యుచుఁ గుందుచు బిట్టు గూయుచున్

**టీక:-** పాపని = శిశువును; చూడన్ = చూచుటకు; కానక = కనబడని; విపత్ = ఆపదల; దశన్ = స్థితిని; ఒంది = పొంది; కలంగి = కలతచెంది; తల్లి = తల్లి; ఓ = ఓయీ; పాపడ = బిడ్డడ; బాలసూర్య = ఉదయిస్తున్న సూర్యుని; నిభ = సరిపోలువాడ; బాల = శిశువులలో; శిరోమణి = శ్రేష్ఠుడా; నేడు = ఇవాళ; గాలి = వాయువుల; కిన్ = కి; చేపడిపోయితే = చిక్కుపడిపోతివా; అనుచున్ = అనుచు; చీరుచున్ = పిలుచుచు; దైవమున్ = దేవుడిని; చాలన్ = ఎక్కువగా; దూఱుచున్ = తిడుతూ; తాపమున్ = బాధ; ఒంది = పడి; నెవ్వ = అధికమైన; వగలన్ = విచారములచేత; డయ్యుచున్ = కుంగిపోతూ; కుందుచున్ = దుఃఖించుచు; బిట్టు = బిగ్గరగా; కూయుచున్ = ఏడ్చుచు.

**భావము:-** తన చంటిబిడ్డ కృష్ణుడు కనబడకపోడం అనే విపత్తులో పడి కొట్టుకుంటున్న యశోదాదేవి ఎంతో కలత చెందింది. “ఓ నా చిట్టితండ్రీ! ఉదయించే సూర్యుని లాంటి ప్రకాశం కలవాడవు కదా నువ్వు. బాలలలో వరేణ్యుడవుకదా. ఇదేమిటయ్యా, ఇలా సుడిగాలి బారిన పడిపోయావు” అని పిలుస్తూ విలపించింది. ఇలాటి విపద్దశ కలిగించిన దేవుణ్ణి అనేక రకాలుగా నిందించింది. ఎఁతో బాధ పడింది. బాధతో కుంగిపోతు విలపించసాగింది.

10.1-268-క.

"సుడిగాలి వచ్చి నిన్నున్

సుడిగొని కొనిపోవ మింట సుడిసుడి గొనుచున్

బెడఁ గడరెడు నా ముద్దుల

కొడుకా! యే మంటి"వనుచు “ఘోరం” బనుచున్

**టీక:-** సుడిగాలి = సుడిగాలి; వచ్చి = వచ్చి; నిన్నున్ = నిన్ను; సుడిగొని = చుట్టుకొని; కొనిపోవన్ = తీసుకుపోగా; మింటన్ = ఆకాశమున; సుడిసుడిగొనుచున్ = మిక్కిలి బడలిక పడుతు; బెడగు = అధికముగ; అడరెడు = కష్టపడెడి; నా = నా యొక్క; ముద్దుల = గారాల; కొడుకా = పుత్రుడా; ఏమంటివి = ఏమంటున్నావు; అనుచున్ = అంటూ; ఘోరంబు = మిక్కిలి భయంకరము; అనుచున్ = అంటు.

**భావము:-** "ఓ నా ముద్దుల కొడుకా! అయ్యో సుడిగాలి వచ్చి ఎత్తుకుపోయిందా కొడుకా! ఆకాశంలో సుళ్ళు తిప్పేస్తుంటే ఎంతలా ఏడుస్తున్నావో ఏమిటో. ఎంతగా బెదిరి పోయావో ఏమిటో. మరీ ఇంత ఘోరమా" అంటు యశోద వాపోతోంది.

10.1-269-ఉ.

**"ఇక్కడఁ బెట్టితిం దనయుఁ డిక్కడ నాడుచు నుండె గాలి దా**
**నెక్కడ నుండి వచ్చె శిశు వెక్కడి మార్గము పట్టిపోయె నే**
**నెక్కడఁ జొత్తు"నంచుఁ గమలేక్షణ గ్రేపుఁ దొఱంగి ఖిన్నయై**
**పొక్కుచు వ్రాలు గోవు క్రియ భూస్థలి వ్రాలె దురంత చింతయై**

**టీక:-** ఇక్కడన్ = ఈ ప్రదేశము నందే; పెట్టితిన్ = ఉంచాను; తనయుడు = కొడుకు; ఇక్కడన్ = ఈ ప్రదేశము నందే; ఆడుచుండెన్ = ఆడుకొనుచుండెను; గాలి = సుడిగాలి; తాన్ = అది; ఎక్కడ = ఎక్కడ; నుండి = నుండి; వచ్చెన్ = వచ్చినదో; శిశువున్ = పిల్లవాడు; ఎక్కడి = ఏ; మార్గమున్ = దారి; పట్టి = అమ్మట; పోయెన్ = వెళ్ళిపోయెనో; నేన్ = నేను; ఎక్కడన్ = ఎక్కడ; చొత్తును = శరణుపొందగలను; అని = అని; అంచున్ = అనుచు; కమలేక్షణ = సుందరి {కమలేక్షణ - కమలములవంటి కన్నులు కలామె, అందగత్తె, స్త్రీ}; క్రేపున్ = దూడను; తొఱంగి = ఎడబాసి; ఖిన్న = ఖేదముపొందిన ఆమె; ఐ = అయ్యి; పొక్కుచున్ = తపించుచు; వ్రాలు = నేలగూలెడి; గోవు = ఆవు; క్రియన్ = వలె; భూస్థలిన్ = నేలమీద; వ్రాలెన్ = పడెను; దురంత = అంతులేని; చింత = విచారము కలామె; ఐ = అయ్యి.

**భావము:-** "పిల్లాడ్ని ఇక్కడే ఇలా పడుకో బెట్టా. నా చిన్ని కన్నయ్య ఇక్కడే ఆడుతు ఉన్నాడు. ఇంతలో ఈ పాడు గాలి ఎక్కనుండి వచ్చిందో. నా పిల్లాడ్ని ఎక్కడకి ఎగరేసుకు పోతోందో. నా కొడుకు ఏమైపోతున్నాడో. అయ్యో నా కింకేం సాయం

దొరుకుతుంది." అంటూ ఆ కలువ కన్నుల కాంతామణి యశోద, లేగదూడ దూరమైన దుఃఖంతో అరుస్తు కూలే పాడి ఆవులా, భరించరాని దుఃఖంతో నేలమీద కుప్పకూలి పోయింది.

10.1-270-క.

పాపనికై యిటు పొగిలెడి
యా పాపని తల్లిఁ జూచి యారటపడుచున్
గోపాలసతులు బాష్పజ
లాపూరిత నయన లైరి యార్తిం బడుచున్

టీక:- పాపని = కొడుకు; కై = కోసము; ఇటు = ఈ విధముగ; పొగిలెడి = దుఃఖించెడి; ఆ = ఆ; పాపని = బిడ్డ; తల్లిన్ = తల్లిని; చూచి = చూసి; ఆరాటపడుచున్ = కంగారుపడుతు; గోపాల = యాదవుల; సతులు = ఇల్లాండ్రు; బాష్పజల = కన్నీళ్ళతో; ఆపూరిత = నిండిన; నయనలు = కన్నులు కలవారు; ఐరి = అయ్యారు; ఆర్తింబడుచున్ = దుఃఖపడుతు.

భావము:- సుడిగాలి ఎత్తుకుపోయిన తన కొడుకు కృష్ణుని కోసం ఇలా విలపిస్తున్న తల్లి యశోదాదేవిని చూసి, గోపికలు ఆరాటంతో కళ్ళనీళ్ళు పెట్టుకుని దుఃఖించసాగారు.

10.1-271-శా.

ఆలోఁ జక్రసమీరదైత్యుఁడు మహాహంకారుఁడై మింటికిన్
బాలుం దోకొనిపోయి పోయి తుదిఁ దద్భారంబు మోవన్ బల
శ్రీ లేమిం బరిశాంత వేగుఁ డగుచుం జేష్టింపఁగా లేక ము
న్నీలా గర్భకుఁ జూడ నంచు నిటమీఁ దెట్లంచుఁ జింతించుచున్.

టీక:- ఆ = అంత; లోన్ = లోపల; చక్రసమీరదైత్యుడు = తృణావర్తుడు {చక్రసమీర దైత్యుడు - చక్రసమీర (సుడిగాలి) దైత్యుడు (రాక్షసుడు), తృణావర్తుడు}; మహా = మిక్కిలి; అహంకారుడు = అహంకారము కలవాడు; ఐ = అయ్యి; మింటి = ఆకాసమున; కిన్ = కు; బాలున్ =

పిల్లవానిని; తోకొని = తీసుకొని; పోయిపోయి = చాలా దూరము పోయి; తుదిన్ = చివరకు; తత్ = అతని; భారంబున్ = బరువును; మోవన్ = మోయుటకు; బల = బలము; శ్రీ = కలిమి; లేమిన్ = లేకపోవుటచేత; పరి = మిక్కిలి; శాంత = తగ్గిన; వేగుడు = వేగము కలవాడు; అగుచున్ = ఔతూ; చేష్టింపగాలేక = కదలలేక మెదలలేక; మున్ను = ఇంతక్రితము ఎప్పుడును; ఇలాగు = ఇలా; అర్భకున్ = ఏ పిల్లవానిని; చూడన్ = చూడలేదు; అంచున్ = అనుచు; ఇటమీద = ఇకపై; ఎట్లు = ఎలాగ; అంచున్ = అనుచు; చింతించుచున్ = బాధపడుతు;

**భావము:-** ఈలోగా, ఆ సుడిగాలిరాక్షసుడు, తృణావర్తుడు మిక్కిలి అహంకారంతో బాలకృష్ణుని ఆకాశంలో ఎంతో ఎత్తుకి తీసుకుపోసాగాడు. అయితే కృష్ణుడు క్రమేపీ బరువెక్కి పోసాగాడు. క్రమేణా రాక్షసుడికి బాలుని బరువు భరించే శక్తి సామర్థ్యాలు సరిపోవటం లేదు. వాడి తిరిగే వేగం తగ్గిపోతోంది. కడకు కదలటం కూడ కష్టసాధ్యం అయిపోయింది. “ఇంతకు ముందు ఇలాంటి పిల్లాణ్ణి ఎక్కడా చూడలేదే, ఇంకెలా బతకను బాబోయ్” అని విచారించసాగాడు.

10.1-272-వ.

**అట్లు దనుజుండు చింతించుచున్న సమయంబున.**

**టీక:-** అట్లు = ఆ విధముగ; దనుజుండు = రాక్షసుడు; చింతించుచున్న = బాధపడుతున్న; సమయంబునన్ = సమయము నందు.

**భావము:-** అలా తృణావర్తుడు బాలుని బరువు మోయలేక ఆరాటపడుతున్నాడు. అప్పుడు

10.1-273-క.

**బాలద్విరద కరంబులఁ**

**బోలెడి కరములను దనుజు బొండుగు బిగియం**

**గీలించి వ్రేలఁ బడియెను**

**బాలకుఁ డొక కొండభంగి బరు పై యధిపా!**

**టీక:-** బాల = పిల్ల, గున్న; ద్విరద = ఏనుగు; కరంబులన్ = తొండములు; పోలెడి = వంటి;

కరములను = చేతులతో; దనుజున్ = రాక్షసుని; బొండుగున్ = మెడను; బిగియన్ = గట్టిగా; కీలించి = చేర్చిపట్టుకొని; వ్రేలబడియెను = వేలాడబడెను; బాలకుడు = పిల్లవాడు; ఒక = ఒక; కొండ = పర్వతము; భంగిన్ = వలె; బరువై = బరువెక్కినవాడయ్యి; అధిపా = రాజా.

<u>భావము</u>:- ఓ పరీక్షిన్మహారాజా! కృష్ణుడు గున్న ఏనుగు తొండాల్లాంటి తన రెండు చేతులు తృణావర్తుని కంఠానికి, శిక్షగావేసే బొండకొయ్యలా, మెలేసి బిగించాడు. పెద్ద కొండంత బరువై వాడి మెడగట్టిగా పట్టుకొని వేళ్ళాడసాగాడు.
రాజు శిక్షవేస్తేనే ఇక్కడ బాధపెట్టినా, పాప పరిహారం జరిగి నరకబాధలు తగ్గుతాయి. అలాగే భగవంతుడు వేసే శిక్షైనా అనుగ్రహమే. అందుకే అధిపా అని ప్రయోగించారేమో అనుకుంటాను.

10.1-274-క.

**మెడ బిగియఁ బట్టుకొని డిగఁ**

**<u>బ</u>డియెడి బాలకునిచేతఁ <u>బ</u>ర్వతనిభుచే**

**విడివడఁజాలక వాఁ డురిఁ**

**<u>బ</u>డి బెగడెడు ఖగము భంగి <u>భ</u>యముం బొందెన్.**

<u>టీక</u>:- మెడన్ = కంఠమును; బిగియన్ = బిగుతుగా; పట్టుకొని = పట్టుకొని; డిగబడియెడి = దిగలాగెడి; బాలకుని = పిల్లవాని; చేతన్ = వలన; పర్వత = పర్వతము; నిభున్ = వలె బరువైనవాని; చేన్ = వలన; విడివడజాలకన్ = వదిలించుకొనలేక; వాడున్ = అతను; ఉరిన్ = ఉచ్చు నందు; పడి = తగుల్కొని; బెగడెడు = వెఱచు నట్టి; ఖగము = పక్షి; భంగిన్ = వలె; భయమున్ = భీతిని; పొందెన్ = పొందెను.

<u>భావము</u>:- తన కంఠం బిగించి పట్టుకున్న పర్వతమంత బరువైన కృష్ణబాలకుని బరువు దిగలాగుతుంటే, ఆ పట్టు తప్పించుకోలేక తృణావర్తుడు ఉరిలో చిక్కుకొని కొట్టుకొనే పక్షిలాగ గిలగిలా కొట్టుకోసాగాడు.

10.1-275-క.

**హరి కరతల పీడనమునఁ**

**బరవశుఁడై ఱాలమీఁద భగ్నాంగకుఁ డై**

**సురవైరిభటుఁడు గూలెను**

**బురభంజను కోలఁ గూలు పురముం బోలెన్.**

టీక:- హరి = బాలకృష్ణుని; కరతల = అరచేతుల; పీడనమునన్ = నొక్కబడుటచేత; పరవశుడు = స్వాధీనము తప్పినవాడు; ఐ = అయ్యి; ఱాల = రాళ్ళ; మీదన్ = పైన; భగ్నాంకుడు = విరిగిన అంగాలు కలవాడు; ఐ = అయ్యి; సురవైరి = కంసుని {సురవైరి - సురల (దేవతల) వైరి (శత్రువు), కంసుడు}; భటుడు = బంటు; కూలెన్ = పడిపోయెను; పురభంజను = పరమశివుని {పురభంజనుడు - త్రిపురసంహారుడు, శివుడు}; కోలన్ = బాణమునకు; కూలు = పడిపోయిన; పురమున్ = పురములు; పోలెన్ = వలె.

భావము:- అలా పాపాలు హరించేవాడైన శ్రీకృష్ణుడు చేతులుతో నొక్కుతున్న నొక్కుడుకి, స్వాధీనం తప్పి తృణావర్తుడు రాళ్ళమీద పడ్డాడు. అలా త్రిపురసంహారి శంకరుని బాణం దెబ్బకి పురము కూలినట్లు కూలి పడ్డ ఆ దేవతల శత్రువు అవయవాలు అన్నీ తుక్కు తుక్కుగా చితికిపోయాయి.

10.1-276-వ.

**అంత గోపకాంత లంతయుం గని రోదనంబులు మాని సమ్మోదంబున విక్కవిరిసి రక్కసుని యురంబున మురువు గలిగి బరువులేక ప్రేలు బాలునిం గొనివచ్చి ముచ్చిరుచున్న తల్లి కిచ్చి రప్పుడు గోపగోపికాజనంబు లందఱు దమలో నిట్లనిరి.**

టీక:- అంతన్ = అప్పుడు; గోపకాంతలు = గోపికలు; అంతయున్ = ఇదంతా; కని = చూసి; రోదనంబులు = ఏడుపులు; మాని = మానేసి; సమ్మోదంబునన్ = మిక్కిలి ఆనందముతో; విక్కవిరిసి = విరిసివిరిసి; రక్కసుని = రాక్షసుని; ఉరమునన్ = వక్షస్థలమున; మురువు =

మురిపము, విలాసముగ; కలిగి = ఉండి; బరువు = బరువుగా; లేక = ఉండకుండగ; వ్రేలు = వేలాడుచున్న; బాలునిన్ = పిల్లవానిని; కొనివచ్చి = తీసుకొని వచ్చి; ముచ్చిరుచున్న = చింతిల్లుచున్న; తల్లి = తల్లి; కిన్ = కి; ఇచ్చిరి = అందించారు; అప్పుడు = ఆ సమయము నందు; గోప = గోపకులు; గోపికా = గోపికలైన; జనంబులు = వారు; అందఱున్ = అందరు; తమలోన్ = వారిలోవారు; ఇట్లు = ఇలా; అనిరి = అనుకొనిరి.

<u>భావము</u>:- అలా తృణాసురుడు నేలకూలటం అంతా చూసిన గొల్లభామలు సంతోషంతో ఆ రాక్షసుడి గుండెల మీద బరువుగా ఉండటం మాని విలాసంగా ఆడుకుంటున్న కృష్ణబాలకుని తీసుకొని వచ్చి, తల్లి యశోదకు ఇచ్చారు. వాళ్ళు ఆశ్చర్యంతో ఇలా అనుకోసాగారు.

10.1-277-క.

"రక్షణము లేక సాధుఁడు

<u>ర</u>క్షితుఁ డగు సమతఁ జేసి <u>రా</u>యిడు లందున్

రక్షణములు వెయి గలిగిన

<u>శి</u>క్షితుఁ డగు ఖలుఁడు పాప<u>చి</u>త్తుం డగుటన్.

<u>టీక</u>:- రక్షణము = కాపుదలలు ఏమియు; లేక = లేకున్నను; సాధుడు = మంచివాడు; రక్షితుడు = కాపాడబడినవాడు; అగున్ = అగును; సమతన్ = సరియగు బుద్ధి; చేసి = వలన; రాయిడుల్ = సంకటములు కలిగిన; అందున్ = సమయ మందు; రక్షణములున్ = కాపుదలలు; వెయి = అనేకములు; కలిగినను = ఉన్నప్పటికిని; శిక్షితుడు = శిక్షింపబడినవాడు; అగున్ = అగును; ఖలుడు = దుర్జనుడు; పాప = పాపపు; చిత్తుండు = మనసు కలవాడు; అగుటన్ = అగుటవలన.

<u>భావము</u>:- మంచి వాడు తన మంచి బుద్ధి వలన, ఏ విధమైన రక్షణలు లేకపోయినా కాపాడబడుతూ ఉంటాడు. చెడ్డవాడు తన పాపాల ఫలితంగా, సంకటాలు కలిగినప్పుడు వేలకొద్దీ భటుల రక్షణలు ఏర్పాటు చేసినా శిక్షింపబడతాడు అంటారు ఇదే కాబోలు?

10.1-278-మ.

గత జన్మంబుల నేమి నోఁచితిమొ? యాగశ్రేణు లేమేమి జే
సితిమో? యెవ్వరి కేమి పెట్టితిమొ? యే చింతారతిం బ్రొద్దు పు
చ్చితిమో? సత్యము లేమి పల్కితిమొ? యే సిద్ధప్రదేశంబుఁ ద్రొ
క్కితిమో? యిప్పుడు జూడఁగంటి మిచటం గృష్ణార్భకు న్నిర్భయున్."

**టీక:-** గత = పూర్వ; జన్మంబులన్ = జన్మలలో; ఏమి = ఏమి; నోచితిమో = నోమునోచితిమో; యాగ = యజ్ఞముల; శ్రేణులు = సముదాయములను; ఏమేమి = ఏమి ఏమి; చేసితిమో = ఆచరించితిమో; ఎవ్వరి = ఎవరి; కిన్ = కి; ఏమి = ఏమిటి; పెట్టితిమొ = దానము చేసితిమో; ఏ = ఎట్టి; చింత = విచారించుట ఎడలి; రతిన్ = ఆసక్తితో; ప్రొద్దున్ = కాలము; పుచ్చితిమో = గడపితిమో; సత్యముల్ = సత్యములను; ఏమి = వేటిని; పల్కితిమో = చెప్పామో; ఏ = ఎట్టి; సిద్ధ = పవిత్రమైన; ప్రదేశంబున్ = చోటును; త్రొక్కితిమో = దర్శించితిమో; ఇప్పుడున్ = ఈ సమయమున; చూడగంటిమి = చూచు భాగ్యము పొందితిమి; ఇచటన్ = ఇక్కడ; కృష్ణా = కృష్ణు డనెడి; అర్భకున్ = బాలుని; నిర్భయున్ = భయము లేని వానిని.

**భావము:-** పూర్వ జన్మలలో ఏమి పుణ్య చేశామో? ఏమి నోములు నోచామో? ఎంతటి దానాలు చేశామో? ఎంత గొప్ప తత్వ విచారాలు చేశామో? ఎంతటి సత్యాలు పలికామో? ఎలాంటి పుణ్యక్షేత్రాలు దర్శించామో కానీ? ఇవాళ ఈ చిన్ని కన్నయ్యన కృష్ణయ్యను మళ్ళా చూడగలిగాము. ఇదేం విచిత్రమూ ఈ చిన్ని పాపడికి భయం అన్నదే లేదు.

## పాలుతాగి విశ్వరూప ప్రదర్శన

10.1-279-వ.

అని పలికి రంత నందుండు మున్ను దనకు వసుదేవుండు జెప్పిన మాటలకు వెఱఁగుపడుచుండె మఱియును.

**టీక:-** అని = అని; పలికిరి = అన్నారు; అంతన్ = అప్పుడు; నందుండు = నందుడు; మున్ను = ఇంతకు ముందు; తన = అతని; కున్ = కి; వసుదేవుండు = వసుదేవుడు; చెప్పిన

= తెలిపినట్టి; మాటలు = పలుకుల; కున్ = కు; వెఱంగుపడుచుండెన్ = ఆశ్చర్యపోతుండెను; మఱియును = ఇంకను.

భావము:- ఇలా గొల్లభామలు తమలో అనుకుంటూ ఉంటే, నందుడు ఇంతకు ముందు వసుదేవుడు తనకు చెప్పిన మాటలు గుర్తుచేసుకుని ఆశ్చర్యపోసాగాడు.

10.1-280-సీ.

జననాథ! యొకనాడు చన్నుఁ చేఁపినఁ దల్లి-

చిన్ని ముద్దుల కృష్ణుఁ జేరఁ దిగిచి

యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి-

చన్నిచ్చి నెమ్మోము చక్క నివిరి

యల్లని నగవుతో నావులించిన బాలు-

వదన గహ్వరమున వారినిధులు

దిశలు భూమియు వనద్వీపశైలంబులు-

నేఱులు గాలియు నినుడు శశియు

10.1-280.1-ఆ.

దహనుఁ డాకసంబు దారలు గ్రహములు

నఖిలలోకములు జరాచరంబు

లైన భూతగణము లన్నియు నుండుటఁ

జూచి కన్నుమోడ్చి చోద్యపడియె.

టీక:- జననాథ = రాజా {జననాథుడు - జనులకు పతి, రాజు}; ఒక = ఒకానొక; నాడు = దినమున; చన్నున్ = స్తనము నందు; చేఁపిన = పాలు ఉబ్బగా; తల్లి = తల్లి; చిన్ని = చిన్నవాడైన; ముద్దుల = గారాల; కృష్ణున్ = కృష్ణుని; చేరన్ = దగ్గరకు రమ్మని; తిగిచి = తీసుకొని; ఎత్తి = ఎత్తుకొని; పెందొడల = పెద్దవైన తొడల; పైన్ = మీద; ఇడికొని = పెట్టికొని;

ముద్దాడి = ముద్దులు పెట్టుకొని; చన్నున్ = చనుబాలు; ఇచ్చి = తాగించి; నెఱ = విశాలమైన; మోమున్ = ముఖమును; చక్కన్ = చక్కగా; నివిరి = నిమిరి; అల్లని = మెల్లని; నగవు = నవ్వు; తోన్ = తోపాటు; ఆవులించిన = ఆవులింతలిడగా; బాలు = పిల్లవాని; వదనగహ్వరమున = నోటి యందు; వారినిధులున్ = సముద్రములు; దిశలున్ = దిక్కులు; భూమియున్ = భూమండలము; వన = అడవులు; ద్వీప = ద్వీపములు; శైలంబులున్ = పర్వతములు; ఏఱులున్ = నదులు; గాలియున్ = వాయువు; ఇనుడు = సూర్యుడు; శశియున్ = చంద్రుడు. దహనుడు = అగ్ని; ఆకసంబున్ = ఆకాశము; తారలున్ = నక్షత్రములు; గ్రహములున్ = గ్రహములు; అఖిల = సమస్తమైన; లోకములున్ = లోకములు; చర = చరించగలిగినవి; అచర = చరించలేనివి; ఐన = అయినట్టి; భూతగణములు = జీవజాలములు; అన్నియును = సమస్తము; ఉండుటన్ = ఉండుటను; చూచి = చూసి; కన్ను = కళ్ళు; మోడ్చి = మూసికొని; చోద్యపడియె = ఆశ్చర్యపోయెను.

<u>భావము</u>:- ఓ జనాధిప! పరీక్షిన్మహారాజా! యశోదకు ఒకనాడు పాలిండ్లు చేపుకు వచ్చాయి. తన ముద్దుల కృష్ణుని ఎత్తుకొని, ఒడిలో పడుకోబెట్టుకొని ముద్దాడింది. చిన్ని కృష్ణునికి చక్కగా పాలు తాగించింది. ప్రేమగా ముఖం నిమురసాగింది. ఆ అల్లరి పిల్లాడు తన మాయలమారి చిరునవ్వులు నవ్వుతు నిద్రవస్తున్నట్లు ఆవులించాడు. అతని నోరు పెద్ద కొండగుహవలె యశోదకు కనబడింది. ఆ లోతులలో సముద్రాలు, దిక్కులు, భూమి, అరణ్యాలు, ద్వీపాలు, పర్వతాలు, నదులు, గాలి, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఆకాశము, తారలు, గ్రహాలు, సర్వలోకాలు చరచారాలైన అన్ని జీవరాశుల తోసహా కనబడ్డాయి. ఆమె కన్నులు అరమోడ్పులు అయ్యాయి. ఆమె నివ్వెరపోయింది.

వదన గహ్వరము అంటే వాక్ స్థానమైనది. మరి ఈ చరాచరజగత్తు సమస్తం వాగధిష్టానం. . అంటే శబ్దనిష్ఠం కదా. “సర్వంశబ్దనిష్ఠంజగత్” అని ప్రమాణం. అంటే శబ్దం లేకపోతే ఏమి లేదని. ఆహా ఏమి చోద్యం. చూపుతున్నవాడు సాక్షాత్తు పరబ్రహ్మ. చూపుతున్నది తల్లి జీవజాలం సమస్తం అనుకోవచ్చా. జననాథుడు అంటే జీవజాలంలో జ్ఞానం గల మానవు లందరి నాథుడు కదా.

10.1-281-వ.

**అంత నొక్కనాడు వసుదేవు పంపున యాదవ పురోహితుం డైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిఁ గనుంగొని లేచి నిలిచి కృతాంజలి యై.**

టీక:- అంతన్ = అంతట; ఒక్క = ఒకానొక; నాడు = దినమున; వసుదేవున్ = వసుదేవుని చేత; పంపునన్ = చెప్పబడి; యాదవ = యాదవులకు; పురోహితుండు = పురోహితుడు; ఐన = అయినట్టి; గర్గుండు = గర్గుడు; మంద = వ్రేపల్లె; కున్ = కు; చనుదెంచిన = రాగా; నందుండు = నందుడు; అతనిన్ = అతనిని; కనుంగొని = చూసి; లేచి = ఆసనమునుండి లేచి; నిలిచి = నిలబడి; కృతాంజలి = నమస్కరించినవాడు; ఐ = అయ్యి.

భావము:- ఆ రోజుల్లో ఒకరోజు వసుదేవుడు యాదవుల పురోహితుడు అయిన గర్గుడిని, నందుడి మందకు వెళ్ళమని పురమాయించేడు. అలా గర్గుడు రాగానే నందుడు తన ఆసనం గబుక్కున దిగి, చేతులు జోడించి నిలబడి. . .

10.1-282-క.

**కోరి భజించెను నందుఁడు**
**సారగుణాచారమార్గు సత్సంసర్గు**
**న్నారాధితభర్గున్ మతి**
**దూరితషడ్వర్గుఁ గుజనదుర్గున్ గర్గున్.**

టీక:- కోరి = ప్రీతిగా; భజించెను = సేవించెను; నందుడు = నందుడు; సార = శ్రేష్ఠమైన; గుణ = సుగుణములు; ఆచార = నడవడికలతో; మార్గున్ = నడచువానిని; సత్ = మంచివారితో; సంసర్గున్ = చేరిక కలవానిని; ఆరాధిత = అర్చింపబడిన; భర్గున్ = పరమశివుడు కలవానిని; మతిన్ = మనసునుండి; దూరిత = దూరము చేయబడిన; షడ్వర్గున్ = అరిషడ్వర్గములు కలవాని {అరిషడ్వర్గములు - 1కామ 2క్రోధ 3లోభ 4మోహ 5మద 6మాత్సర్యములు}; కుజన = చెడ్డవారికి; దుర్గున్ = పొందరానివానిని; గర్గున్ = గర్గుడుని.

భావము:- ఆ గర్గమహాముని ఎంతో మంచి గుణాలూ నడవడికలూ కలవాడు;

గొప్ప శివ భక్తుడు; ఎల్లప్పుడూ సత్సాంగత్యంతో ఉండేవాడు, దుర్జన సాంగత్యం వర్జించి మెలగేవాడు; కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యాలు అనే అరిషడ్వర్గాలు విడిచిన వాడు; పైగా పురోహితుడు. అంతటివాని రాకతో సంతోషించినవాడై, మిక్కిలి ప్రీతితో ఆ గర్గుని సేవించాడు.

10.1-283-వ.

**మఱియుఁ దగిన సత్కారంబులు జేసి ఇట్లనియె.**

టీక:- మఱియున్ = ఇంకను; తగిన = అర్హమైన; సత్కారంబులున్ = మర్యాదలు; చేసి = చేసి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- అలా సేవించి, తగిన అతిథి సత్కారాలు చేసి, నందుడు గర్గమునితో ఇలా అన్నాడు

10.1-284-క.

**"ఊరక రారు మహాత్ములు**

**వా రధముల యిండ్లకడకు వచ్చుట లెల్లం**

**గారణము మంగళములకు**

**నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా!**

టీక:- ఊరకన్ = కారణము లేకుండగ; రారు = రాబోరు; మహాత్ములు = గొప్పవారు {మహాత్ములు - గొప్ప చిత్తవృత్తి గలవారు, గొప్పవారు}; వారు = అట్టివారు; అధముల = అల్పుల; ఇండ్ల = నివాసముల; కడ = వద్ద; కున్ = కు; వచ్చుట = రావడ మన్నది; ఎల్లన్ = అంతయు; కారణము = కారణము; మంగళముల్ = శుభముల; కున్ = కు; నీ = నీ యొక్క; రాక = వచ్చుట; శుభంబు = మంచిది; మా = మా; కున్ = కు; నిజము = తథ్యము యిది; మహాత్మా = గొప్పవాడా.

భావము:- "ఓ మహాత్ముడవైన గర్గమహాముని! మీవంటి పెద్దలు, మా వంటి సామాన్యుల ఇళ్ళకు ఉత్తినే రారు. వచ్చారంటే తప్పకుండా ఏదో గొప్ప మేలు సిద్ధించడానికి మాత్రమే. అందుకే "ఊరక రారు మహాత్ములు"అన్న నానుడి

ప్రసిద్ధమైంది కదా. కాబట్టి, తమ రాక వలన మాకు తప్పకుండా శుభాలు కలుగుతాయి. ఇది సత్యం.

10.1-285-శా.

**జ్యోతిశ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి**
**ఖ్యాత స్ఫూర్తివి బ్రహ్మబోధనుఁడ వాకర్ణింపు నా పల్కు ని**
**ర్ణీతుండైన గురుండు మానవులకున్ విప్రోత్తముం డండ్రు నీ**
**చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబుఁ గావింపవే."**

టీక:- జ్యోతిశాస్త్రుల = జ్యోతిషశాస్త్ర పండితుల; కిన్ = కి; ఎల్లన్ = అందరిలోను; మేటరవి = శ్రేష్ఠుడవు; తేజస్ = తేజస్సు కల; మూర్తివి = ఆకృతి కలవాడవు; ఆశాంత = దిగంతములవరకు; విఖ్యాత = ప్రసిద్ధమైన; స్ఫూర్తివి = స్ఫురణ కలవాడవు; బ్రహ్మబోధనుడవు = బ్రహ్మజ్ఞానము కలవాడవు; ఆకర్ణింపు = వినుము; నా = నా యొక్క; పల్కున్ = మాటలను; నిర్ణీతుండు = నిర్ణయింపబడినవాడు; ఐన = అయిన; గురుండు = గురువు; మానవుల్ = నరుల; కున్ = కు; విప్ర = బ్రాహ్మణుడైన; ఉత్తముండు = ఉత్తముడు; అండ్రున్ = అనెదరు; నీ = నీ యొక్క; చాతుర్యంబునన్ = నేర్పుతోటి; ఈ = ఈ; కుమారుల్ = బాలుర; కున్ = కు; సంస్కారంబు = నామకరణాది కర్మలను; కావింపవే = చేయుము.

భావము:- మానవులకు తమ కుల పురోహితుడే సర్వోత్తమమైన విప్రుడు అంటారు. పైగా మీరు గొప్ప జ్యోతిష్కులలో శ్రేష్ఠులు, మిక్కిలి తేజోవంతులు. నలుదిక్కులా పాకిన కీర్తి కలవారు. బ్రహ్మజ్ఞానం చెప్పే గురువు. కాబట్టి. దయచేసి నా అభ్యర్థన మన్నించి, ఈ పిల్లలకు నామకరణము మొదలైన సంస్కారాలు చేయించి వీరిని పరిశుద్ధులను చెయ్యి."

## బలరామ కృష్ణుల నామకరణం

10.1-286-వ.

అని రామకృష్ణులం జూపిన గర్గుండు మున్ను కంసునిచేత వ్రేటుపడి దివికెగసిపోయిన తెఱవ చెప్పిన తెఱంగు తేటపఱచి దేవకీదేవి కొడుకని కృష్ణుని గంసుండు దలంచుఁ గావున రహస్యంబున సంస్కారంబు జేయుట కార్యం బని నందానుమతంబున రోహిణీకుమారు నుద్దేశించి.

టీక:- అని = అని; రామ = బలరాముడు; కృష్ణులన్ = కృష్ణులను; చూపినన్ = చూపించగా; గర్గుండు = గర్గుడు; మున్ను = ఇంతకు పూర్వము; కంసుని = కంసుడి; చేతన్ = వలన; వ్రేటుపడి = కొట్టబడి; దివికిన్ = ఆకాశమునకు; ఎగసిపోయిన = ఎగిరిపోయినట్టి; తెఱవ = స్త్రీ; చెప్పిన = పలికిన; తెఱంగు = విధమును; తేటపఱచి = తెలియజెప్పి; దేవకీదేవి = దేవకీదేవి యొక్క; కొడుకు = పుత్రుడు; అని = అని; కృష్ణుని = కృష్ణుని; కంసుండు = కంసుడు; తలచున్ = భావించును; కావునన్ = కనుక; రహస్యంబునన్ = ఇతరులకు తెలియకుండ; సంస్కారంబు = కర్మలు; చేయుట = ఆచరించుట; కార్యంబు = తగినపని; అని = అని; నంద = నందుని యొక్క; అనుమతంబునన్ = అంగీకారముతో; రోహిణీ = రోహిణీదేవి యొక్క; కుమారున్ = పుత్రుని; ఉద్దేశించి = గురించి.

భావము:- అలా నందుడు నామకరణం చేయమని గర్గుని అడిగి, బలరాముడు, కృష్ణుడు ఇద్దరిని చూపించాడు. అంతట గర్గుడు కంసుడు బాలిక అయితేనేం అష్టమ గర్భం అనుకుంటూ చంపబోతే ఆకాశంలోకి ఎగిరిపోయిన ఆ యోగమాయ చెప్పిన మాటలు వివరించి చెప్పి; ఈ కృష్ణుడే ఆ దేవకీదేవి కొడుకు అని అనుకునే అవకాశం ఉంది కనుక; నామకరణాది సంస్కారాలు గోప్యంగా చేయటం మేలని చెప్పాడు. దానికి నందుడు అంగీకరించిన పిమ్మట రోహిణి కొడుకుని గురించి. . .

10.1-287-క.

“జనులు రమియింపఁ దిరిగెడి
యనువు కలిమి రాముఁ డనియు యదు సంకర్షం
బున సంకర్షణుఁ డనియును
ఘన బలమున బలుడు ననియు గణుతించె నృపా!”

టీక:- జనులున్ = ప్రజలు; రమియింపన్ = సంతోషించునట్లుగ; తిరిగెడి = మెలగెడి; అనువు = మెలకువ; కలిమిన్ = ఉండుటచేత; రాముడు = రాముడు; అనియున్ = అని; యదు = యాదవులను, యదువంశాంకురం; సంకర్షంబునన్ = కలిపి యుంచుటచే, లాగబడుటచేత; సంకర్షణుఁడు = సంకర్షణుడు; అనియునున్ = అని; ఘన = మిక్కిలి అధికమైన; బలమునన్ = శక్తి కలిగి యుండుటచే; బలుడు = బలుడు; అనియున్ = అని; గణుతించెన్ = ఎంచెను (నామములను); నృపా = రాజా.

భావము:- ఓ రాజా1 ఈ రోహిణీ కుమారుడుకి లోకులు అందరు సంతోషించేలా ప్రవర్తించేవాడు కనుక రాముడు అనీ. యాదవులలో ఐకమత్యం పెంచి కలిసి మెలిసి ఉండేలా చూసేవాడు కనుక సంకర్షణుడు అనీ. గొప్ప బలవంతుడు కనుక బలుడు అనీ గర్గుడు నామకరణం చేసాడు.

10.1-288-వ.

మఱియుం గృష్ణు నుద్దేశించి తొల్లి “యీ శిశువు ధవళారుణపీత వర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁ గృష్ణుం డయ్యె; వసుదేవునకు నొక్కెడ జన్మించిన కారణంబున వాసుదేవుండయ్యె; నీ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటం జేసి నామంబు లనేకంబులు గల; వీ శాబకునివలన మీరు దుఃఖంబులఁ దరియింతు; రీ యర్భకునిచేత దుర్జనశిక్షణంబు సజ్జనరక్షణంబు నగు నీ కుమారుండు నారాయణ సమానుం” డని చెప్పి; తన గృహంబునకు

నమ్మునీశ్వరుండు జనియె; నందుండును బరమానందంబున నుండె; నంత.

**టీక:-** మఱియున్ = ఇంకను; కృష్ణున్ = కృష్ణుని; ఉద్దేశించి = గురించి; తొల్లి = పూర్వము; ఈ = ఈ; శిశువు = బిడ్డడు; ధవళ = తెల్లని; అరుణ = ఎఱ్ఱని; పీత = పచ్చని; వర్ణుండు = వన్నెలు కలవాడు; ఐ = అయ్యి; ఇప్పుడున్ = ప్రస్తుతము; నల్లన = నల్లటివాడు; ఐన = అయినట్టి; కతంబునన్ = కారణముచేత; కృష్ణుండు = కృష్ణుడు; అయ్యె = అయ్యెను; వసుదేవున్ = వసుదేవున; కున్ = కు; ఒక్క = ఒకానొక; ఎడన్ = చోట; జన్మించిన = పుట్టిన; కారణంబునన్ = కారణముచేత; వాసుదేవుండు = వాసుదేవుడు; అయ్యెన్ = అయ్యెను; ఈ = ఈ; పాపని = బాలుని; కిన్ = కి; గుణ = సుగుణములు; రూప = స్వరూపములు; కర్మంబులున్ = చేసినపనులు; అనేకంబు = పెక్కులు; కలుగుటన్ = ఉండుట; చేసి = వలన; నామంబులున్ = పేర్లు; అనేకంబులున్ = పెక్కులు; కలవు = ఉన్నవి; ఈ = ఈ; శాబకుని = పిల్లవాని; వలన = వలన; మీరున్ = మీరు; దుఃఖంబులన్ = దుఃఖములను; తరియింతురు = దాటెదరు; ఈ = ఈ; అర్భకుని = పిల్లవాని; చేతన్ = వలన; దుర్జన = దుష్టులు; శిక్షణంబున్ = శిక్షింపబడుట; సజ్జన = మంచివారి; రక్షణంబున్ = కాపాడబడుట; అగున్ = జరుగును; ఈ = ఈ; కుమారుండు = బాలుడు; నారాయణ = విష్ణుమూర్తితో; సమానుండు = సమానమైనవాడు; అని = అని; చెప్పి = తెలిపి; తన = అతని యొక్క; గృహంబున్ = నివాసమున; కున్ = కు; ఆ = ఆ; ముని = మునులలో; ఈశ్వరుండు = శ్రేష్ఠుడు; చనియెన్ = వెళ్ళిపోయెను; నందుండునున్ = నందుడు; పరమ = అత్యధికమైన; ఆనందంబునన్ = ఆనందమున; ఉండెన్ = ఉండెను; అంత = అప్పుడు.

**భావము:-** ఆ తరువాత, యశోదా కుమారుడు కృష్ణునికి "ఈ బిడ్డడు పూర్వం కృతయుగంలో తెల్లగానూ, త్రేతాయుగంలో ఎఱ్ఱగానూ, ద్వాపర యుగంలో పచ్చగానూ ఉండేవాడు కానీ. ప్రస్తుతం నల్లని దేహం కలవాడు అయ్యాడు కనుక కృష్ణుడు అని పేరు పెట్టాడు, వసుదేవుడికి పుట్టుటచేత వాసుదేవుడు అనే పేరుతో ప్రసిద్ధుడు అవుతాడు అని చెప్పి, ఈ పిల్లవాడికి అనేకమైన గుణాలు, రూపాలు, సాధించిన కార్యాలు లెక్కలేనన్ని ఉంటాయి కనుక అనంతమైన పేర్లు ఉంటాయి. ఇతని వలన మీ కష్టాలు అన్నీ నష్టాలు అవుతాయి అంటే నశించిపోతాయి. ఇతను దుర్జనులను శిక్షిస్తాడు,

సజ్జనులను రక్షిస్తాడు. ఈ బాలుడు సాక్షాత్తు విష్ణుమూర్తితో సమానుడు." అని చెప్పి, నందుడు దగ్గర సెలవు తీసుకొని వెళ్లిపోయాడు. నందుడు పరమానంద భరితుడు అయ్యాడు.

## బలరామ కృష్ణుల క్రీడాభివర్ణన

10.1-289-సీ.

జానుభాగముల హస్తములు వీడ్వడఁ జేసి-

నిగుడు చల్లనఁ బోదు రింత నంత

నవ్వల పయ్యెద లంది జవ్వాడుదు-

రాల క్రేపుల తోఁక లలమి పట్టి

విడువ నేరక వాని వెనువెంట జరుగుదు-

రప్పంకముల దుడు కడర జొత్తు

రెత్తి చన్నిచ్చుచో నిరుదెసఁ బాలిండ్లు-

చేతులఁ బుడుకుచుఁ జేఁపు గలుగ

10.1-289.1-తే.

దూటుదురు గ్రుక్క గ్రుక్కకు దోర మగుచు

నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తములుగఁ

గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు

రామకృష్ణులు శైశవరతులఁ దగిలి.

టీక:- జానుభాగములన్ = మోకాళ్ళపైనుండి; హస్తములున్ = చేతులు; వీడ్వడన్ = విడిచివచ్చునట్లుగ; చేసి = చేసి; నిగుడుచున్ = నిక్కుతూ; పోదురు = వెళ్ళెదరు; ఇంతనంతన్ = కొంచెము దూరము; అవ్వల = అమ్మల యొక్క; పయ్యెదలు = పైటకొంగులు; అంది = అందుకొని; జవ్వాడుదురు = ఊగులాడెదరు; ఆలక్రేపుల = ఆవుదూడల; తోకలున్ = తోకలను;

అలమి = ఒడిసి (గట్టిగా); పట్టి = పట్టుకొని; విడువన్ = వదల; నేరక = లేక; వాని = వాటి; వెనువెంటన్ = వెనకాతలనే; జరుగుదురు = జారుతారు; ఆ = ఆ; పంకములన్ = బురదలలో; దుడుకు = దుడుకుతనము; అడరన్ = అతిశయించగా; చొత్తురు = దూరుదురు; ఎత్తి = ఎత్తుకొని; చన్నున్ = చనుబాలు; ఇచ్చుచోన్ = ఇచ్చునప్పుడు; ఇరు = రెండు (2); దెసన్ = పక్కల; పాలిండ్లున్ = స్తనములను; చేతులన్ = చేతులతో; పుడుకుచున్ = పిసుకుతూ. దూటుదురు = పీల్చుకొనెదరు; గ్రుక్కగ్రుక్క = ప్రతిగుక్క; కున్ = కు; తోరము = అధిక రుచికరముగ; అగుచున్ = ఔతూ; ఆడుదురు = పలికెదరు; ముద్దు = ఇంపైన; పలుకులు = మాటలు; అవ్యక్తములుగన్ = చక్కగతెలియకుండునట్లు; కరములు = చేతులను; అంఘ్రులున్ = కాళ్ళు; అల్లార్చి = ఊపుతూ; కదలుపుదురు = కదుపుతారు; రామ = బలరాముడు; కృష్ణులున్ = కృష్ణుడులు; శైశవ = బాల; రతున్ = క్రీడలందు; తగిలి = ఆసక్తులై.

**భావము:-** బలరాముడు శ్రీకృష్ణుడు ఇద్దరు పసితనంలో క్రమంగా బాల్యక్రీడలతో గోకులంలో అందరకు సంతోషం కలిగిస్తున్నారు. మోకాళ్ళపై చేతులు వూని పట్టి నెమ్మదిగా లేచి నిలబడతారు. తూలుతారు మళ్ళా నిలబడతారు. అటునిటు నడుస్తారు. లేగ ఆవుదూడల తోకలు పట్టుకొంటారు, అవి పరుగెడుతుంటే, ఆ తోకలు వదలిపెట్టలేక వాటి వెనుక జరుగుతు ఉంటారు. తల్లులు పాలు ఇస్తుంటే రెండు చేతులతోను పాలిండ్లు రెండు తడుముతు గుక్కగుక్కకు చేపుకు వచ్చేలా పాలు త్రాగుతుంటారు. వచ్చీరాని ముద్దుమాటలు పలుకుతారు. చేతులు కాళ్ళు కదుపుతు పసిక్రీడలలో నాట్యాలు ఆడేవారు.

10.1-290-క.

**తడ** వాడిరి బలకృష్ణులు

**దడ** వాడిరి వారిఁ జూచి తగ రంభాదుల్

దడవాడి రరులు భయమునఁ

**దడ** వాడిరి మంతనములఁ దపసులు వేడ్కన్.

**టీక:-** తడవు = చిరకాలం; ఆడిరి = క్రీడించిరి; బల = బలరాముడు; కృష్ణులున్ = కృష్ణుడు; తడవు = కొంతసేపు; ఆడిరి = నాట్యము లాడిరి; వారిన్ = వారిని; చూచి = చూసి; తగన్ =

తగినట్లుగ; రంభ = రంభ; ఆదుల్ = మున్నగువారు; తడవాడిరి = తడబడిరి; అరులు = శత్రువులు; భయమునన్ = భీతిచేత; తడవు = చాలాసేపు; ఆడిరి = మాట్లాడుకొనిరి; మంతనములన్ = రహస్యముగా; తపసులు = ఋషులు; వేడ్కన్ = కుతూహలముతో.

భావము:- బాల్యక్రీడలలో బలరామ కృష్ణులు ఆలా ఎంతోసేపు ఆడుతుంటే చూసి, రంభ మొదలైన అప్సరసలు ఆకాశంలో ఆనందంగా ఆడుతున్నారు. అరిషడ్వర్గం అనే శత్రువులు పెచ్చుమీరినవారు దుర్మార్గులు. వారు భయంతో తడబడ్డారు. ఋషులు లోకానికి మంచి దనే సంతోషంతో రహస్యంగా ముచ్చట్లలో ఓలలాడారు.

10.1-291-సీ.

తల లెత్తి మెల్లనఁ దడవి యాడెడు వేళ-
  పన్నగాధీశులపగిదిఁ దాల్తు;
రంగసమ్మృష్ట పంకాంగరాగంబుల-
  నేనుగుగున్నల నెత్తువత్తు;
రసమంబులైన జవాతిరేకమ్ముల-
  సింగంపుఁగొదమల సిరి వహింతు;
రాననంబుల కాంతు లంతకంతకు నెక్కు-
  బాలార్క చంద్రుల పగిదిఁ దోతు;

10.1-291.1-తే.

రెలమిఁ దల్లుల చన్నుఁబా లెల్లఁ ద్రావి
పరమయోగోద్భవామృత పానలీల
సోలి యెఱుగని యోగుల సొంపు గందు
రా కుమారులు జనమనోహారు లగుచు.

టీక:- తలలు = శిరస్సులను; ఎత్తి = పైకెత్తి; మెల్లనన్ = మెల్లగా; తడవియాడెడి = పాకెడి;

వేళన్ = సమయమునందు; పన్నగాధీశుల = సర్పరాజుల {పన్నగాధీశులు - ఆదిశేషుడు అనంతుడు వాసుకి మున్నగు సర్పరాజులు}; పగిదిన్ = విధమును; తాల్తురు = ధరింతురు; అంగ = అవయవములకు; సమ్మృష్ట = బాగా పూసుకొన్న; పంక = బురద యనెడి; అంగరాగంబులన్ = గంధపుపూతలచే; ఏనుగు = ఏనుగు; గున్నలన్ = పిల్లల; ఎత్తువత్తురు = సాటియగుదురు; అసమంబులు = సాటిలేని; ఐన = అయినటువంటి; జవ = జవసత్వాదుల; అతిరేకమ్ములన్ = అధిక్యములచేత; సింగపు = సింహపు; కొదమల = పిల్లల; సిరిన్ = మేలిమిని; వహింతురు = పొందెదరు; ఆననంబుల = మోముల; కాంతులు = వికాసములు; అంతంతకున్ = అంతకంతకు; ఎక్కు = ఏక్కువగుతు; బాల = అప్పుడే ఉదయించిన; అర్క = సూర్యబింబము; చంద్రుల = చంద్రబింబముల; పగిదిన్ = వలె; తోతురు = కనబడుదురు; ఎలమిన్ = చక్కగా; తల్లుల = తల్లుల యొక్క.

చన్నుబాలు = స్తన్యములు; ఎల్లన్ = అన్ని; త్రావి = తాగి; పరమ = సర్వోత్కృష్టమైన; యోగ = బ్రహ్మనిష్ఠ వలన; ఉద్భవ = పుట్టిన; అమృత = ఆనందామృతమును; పాన = తాగిన; లీలన్ = విధముగ; సోలి = మైమరచి; ఎఱుగని = తెలియని; యోగుల = యోగుల; సొంపున్ = ఆనందమును; కందురు = పొందెదరు; ఆ = ఆ; కుమారులు = పిల్లలు; జన = ప్రజల; మనః = మనసులను; హారులు = దోచుకొనువారు; అగుచున్ = ఔతూ.

<u>భావము</u>:- అలా బలభద్ర కృష్ణులు బాల్యక్రీడలలో నేలపై ప్రాకుతు మెల్లగా తలలెత్తి ఆడుకుంటు ఉంటే, ఆదిశేషుడు వంటి సర్పరాజులు పడగెత్తి ఆడుతున్నట్లు కనిపిస్తారు. ఆటల్లో ఒంటినిండ మట్టి అంటినప్పుడు ఏనుగు గున్నలలా గోచరిస్తారు. కుప్పిగంతులు వేసేటప్పుడు సాటేలేని జవసత్వాలతో సింహం పిల్లలులా కనిపిస్తారు. రోజు రోజుకి వారి ముఖాలలోని తేజస్సు పెరుగుతు ఉదయిస్తున్న సూర్య చంద్రులు లాగ కనబడతారు. తల్లుల చనుబాలన్నీ త్రాగి నిద్ర కూరుకు వస్తుంటే, చక్కటి యోగసాధనతో కలిగిన అనుభవం అనే అమృతాన్ని ఆస్వాదిస్తున్న యోగీశ్వరుల వలె గోచరిస్తున్నారు, వారి లీలలు వీక్షిస్తున్న వ్రేపల్లెవాసులకు తన్మయత్వం కలుగుతోంది.

10.1-292-క.

చూడని వారల నెప్పుడుఁ

జూడక లోకములు మూఁడు చూపులఁ దిరుగం

జూడఁగ నేర్చిన బాలక

చూడామణి జనుల నెఱిఁగి చూడఁగ నేర్చెన్.

టీక:- చూడని = భక్తిలేక తనని లెక్కచేయని; వారలన్ = వారిని; ఎప్పుడును = ఏ సమయము నందును; చూడక = దయచూడకుండ; లోకములున్ = లోకములు {ముల్లోకములు - 1భూలోకము 2స్వర్గలోకము 3పాతాళలోకము}; మూడున్ = మూడింటిని; చూపులన్ = తన ఆజ్ఞ ప్రకారము; తిరుగన్ = నడచునట్లుగ; చూడగన్ = చేయుట; నేర్చిన = తెలిసిన; బాలక = బాలురలో; చూడామణి = శ్రేష్ఠుడు (తలపైని మణివలె); జనులన్ = చుట్టుపక్కల వారిని; ఎఱిగి = ఆనమాలుపట్టి; చూడగన్ = చూచుటను; నేర్చెన్ = నేర్చుకొనెను.

భావము:- ఊర్ధ్వ, అధో, భూలోకాలు మూటిని తన కనుసన్నలలో నడుపే ఆ శ్రీహరి, భక్తిలేక తనని లెక్కచేయని వారి ఎడల దయచూపడు. అట్టి శ్రీహరి శైశవశ్రేష్ఠుడైన కృష్ణుడుగా కళ్ళు తిప్పుతు చుట్టుపక్కలవారిని చూసి గుర్తుపట్ట నారంభించాడు.

10.1-293-క.

నగవుల నవిద్య పోఁడిమి

నగుబాటుగఁ జేయనేర్చు నగవరి యంతన్

నగుమొగముతోడ మెల్లన

నగుమొగముల సతులఁ జూచి నగనేర్చె నృపా!

టీక:- నగవులన్ = నవ్వులతో; అవిద్య = మాయల యొక్క; పోడిమి = సమర్థత; నగుబాటుగ = పరిహాసముగ; చేయన్ = చేయగలుగుట; నేర్చు = తెలిసిన; నగవరి =పరిహాస పేది; అంతన్ = అప్పుడు; నగు = నవ్వు; మొగము = మోము; తోడన్ = తోటి; మెల్లనన్ = మృదువుగ; నగుమొగముల = చిరునవ్వులు కల; సతులన్ = ఇంతులను; చూచి = కనుగొని; నగన్ = నవ్వుట; నేర్చెన్ = నేర్చుకొనెను; నృపా = రాజా.

భావము:- ఓ పరీక్షిన్మహారాజా! మహావిష్ణువు చిరునవ్వు నవ్వితే ఆత్మజ్ఞానము కాని లౌకిక విద్యలను దట్టమైన అజ్ఞానం నవ్వులపాలై, జ్ఞానం పుట్టుకు వస్తుంది. అంతటి పరదైవము మానవ బాలకృష్ణునిగా తనను చూసి నవ్వుతున్న గోపకాంతలను చూసి నవ్వటం నేర్చాడు.

10.1-294-క.

**అవ్వల నెఱుఁగక ముప్వురి**

**క్వవ్వల వెలుఁగొందు పరముఁ డర్భకుఁడై యా**

**యవ్వలకు సంతసంబుగ**

**నవ్వా! యవ్వా! యనంగ నల్లన నేర్చెన్.**

టీక:- అవ్వలన్ = జననులు, ఇతరమైనది; ఎఱుగక = అసలులేకుండ; ముప్వురి = త్రిమూర్తుల {త్రిమూర్తులు - బ్రహ్మ విష్ణు మహేశ్వరులు}; కున్ = కు; అవ్వల = అతీతముగ; వెలుగొందు = ప్రకాశించెడి; పరముడు = అతీతమైన భగవంతుడు; అర్భకుడు = పిల్లవాడు; ఐ = అయ్యి; ఆ = ఆ; అవ్వలు = తల్లుల; కున్ = కు; సంతసంబుగన్ = సంతోషము కలుగునట్లుగ; అవ్వా = అమ్మ; అవ్వా = అమ్మ; అనంగన్ = అనుటను; అల్లనన్ = మెల్లగా; నేర్చెన్ = నేర్చుకొనెను.

భావము:- బ్రహ్మ విష్ణు మహేశ్వరులగు త్రిమూర్తులకు అతీతంగా ప్రకాశించే శ్రీమన్నారాయణుడు జన్మలు లేని వాడు గనుక తనకు అమ్మ అంటు ఎవరు లేరు. జగత్తు అంతటికి తనే అమ్మ. అంతటి పరమపురుషుడు యశోదమ్మ కొడుకై గోపెమ్మలు అందరికి ఆనందం కలిగేలా అమ్మా అమ్మా అనటం నేర్చాడు.
సర్వకారణమై నిష్కారణమై వెలుగు పరబ్రహ్మము ఆత్మావైపుత్రానామాసీత్ అని శ్రుతి కనుక జగత్తునకు మాతృస్థానమైన తానే పుత్రరూపమై జన్మించి అమ్మా అమ్మా అనసాగాడు. అవ్వ అవ్వ అని వేసిన పంచకంచే మాతృత్వ విలువ చెప్పబడుతోందా? ఆదిపరాశక్తితో అబేధం చెప్పబడుతోందా?

10.1-295-క.

అడుగులు వే గలిగియు రెం

డడుగులనే మన్ను మిన్ను నలమిన బాలుం

డడుగిడఁ దొడఁగెను శాత్రవు

లడుగులు సడుగులును వదలి యడు గవనిఁబడన్.

టీక:- అడుగులు = కాళ్ళు; వేగలిగియున్ = వేయిగలిగినను; రెండు = రెండు (2); అడుగులనే = అడుగులతోనే; మన్నున్ = భూమండలము; మిన్నున్ = ఆకాశములను; అలమిన = ఆక్రమించిన; బాలుండు = పిల్లవాడు; అడుగిడన్ = అడుగులువేయుట; తొడగెన్ = మొదలిడెను; శాత్రవుల = శత్రువుల యొక్క; అడుగులు = అడుగులువేయుట; సడుగులును = కీళ్ళును; వదలి = వదులైపోయి; అడుగు = క్రింది; అవనిన్ = నేలపై; పడన్ = వేస్తుండగా.

భావము:- “సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్” అనగా విష్ణుమూర్తి సహస్రాక్షుడు, సహస్రశీర్షుడు, సహస్రపాదుడు. అలా వేయి అడుగులు కలిగిన వాడు. ఇక్కడ వేయి, సహస్రం అంటే అనంతమని గ్రహించదగును. వామనావతారుడై బలిచక్రవర్తి నుండి మూడడుగుల భూమి యాచించి, రెండు అడుగులలో భూమిని ఆకాశాన్ని ఆవరించిన వాడు. అట్టి పరమాత్మ ఇలా శ్రీకృష్ణబాలకుడై తప్పటడుగులు వేయ నారంభించాడు. ఆయన అడుగులు వేయటం చూసి దుష్టులు కాళ్ళు కీళ్ళు జారిపోయి అధమ బుద్ధులు, సణుగుళ్ళు వదిలేసి క్రింద నేలపై పడి అణగిపోయారు.

## హరిహరా భేదము చూపుట

10.1-296-వ.

మఱియును.

టీక:- మఱియున్ = ఇంకను.

భావము:- అంతే కాకుండా

10.1-297-సీ.

తనువున నంటిన ధరణీపరాగంబు-

పూసిన నెఱిభూతి పూఁత గాఁగ;

ముందల వెలుగొందు ముక్తాలలామంబు-

తొగలసంగడికాని తునుక గాఁగ;

ఫాలభాగంబుపైఁ బరగు కావిరిబొట్టు-

కాముని గెల్చిన కన్ను గాఁగఁ;

గంఠమాలికలోని ఘననీల రత్నంబు-

కమనీయ మగు మెడకప్పు గాఁగ;

10.1-297.1-ఆ.

హారవల్లు లురగహారవల్లులు గాఁగ;

బాలలీలఁ బ్రౌఢబాలకుండు

శివుని పగిది నొప్పె శివునికిఁ దనకును

వేఱులేమిఁ దెల్ప వెలయునట్లు.

టీక:- తనువున్ = ఒంటికి; అంటిన = అంటుకొన్న; ధరణీ = మట్టి; పరాగంబున్ = మరకలు; పూసిన = రాసుకొన్న; నెఱి = నిండైన; భూతి = వీబూది; పూత = పూత; కాగన్ = అగుచుండగా; ముందలన్ = శిరస్సుపై; వెలుగొందు = ప్రకాశించెడి; ముక్తాలలామంబు = ముత్యాలచేరు; తొగలసంగడికాని = చంద్రుని {తొగలసంగడికాడు -తొగ (కలువ)ల సంగటికాడు (స్నేహితుడు), చంద్రుడు}; తునుక = రేఖ; కాగన్ = అగుచుండగా; ఫాలభాగంబు = నుదిటి; పైన్ = మీద; పరగు = ఉండునట్టి; కావిరిబొట్టు = నల్లబొట్టు; కాముని = మన్మథుని; గెల్చిన = జయించిన; కన్ను = కన్ను (మూడవకన్ను); కాగన్ = అగుచుండగా; కంఠమాలిక = మెడలోని హారము; లోని = అందలి; ఘన = బాగాపెద్ద; నీల = ఇంద్రనీల; రత్నంబు = మణి; కమనీయము =అందమైనది; అగు=ఐన; మెడకప్పు=కంఠమునందలినల్లదనం; కాగన్= అగుచుండగా.

హారవల్లులు = ముత్యాలహారపుపేటలు; ఉరగ = సర్పములనెడి; హారవల్లులు = దండలపేర్లు; కాగన్ = అగుచుండగా; బాల = పసితనపు; లీలన్ = విలాసములతో; ప్రౌఢ = అన్నీతెలిసిన; బాలకుండు = పిల్లవాడు; శివుని = పరమశివుని; పగిదిన్ = వలె; ఒప్పెన్ = కనబడుచుండెను; శివుని = పరమశివుని; కిన్ = కి; తన = తన; కును = కు; వేఱు = భేదము; లేమిన్ = లేకపోవుటను; తెల్పన్ = తెలియజేయుటకు; వెలయున్ = విలసిల్లిన; అట్లు = విధముగా.

**భావము:-** ఆ శ్రీపతి అపరావతారమైన బాలకృష్ణుడు ఎదగకుండానే పెద్దవాడైన ప్రౌఢబాలకుడు. హరి హరులకు భేదం లేదు ఇద్దరు ఒకటే సుమా అని హెచ్చరిస్తున్నట్లుగా శ్రీకృష్ణుడు బాల్యంలో ఆటపాటల సమయాలలో పరమశివుని వలె కనిపించేవాడు. ఎలా అంటే.

దేహానికి అంటిన దుమ్ము విభూతి పూత వలె కనిపించేది. యశోద ముత్యాలపేరుతో ఉంగరాలజుట్టు పైకి మడిచి ముడివేసింది. అది శంకరుని తలపై ఉండే చంద్రవంకలా కనబడసాగింది. నుదుట పెట్టిన నల్లని అగులు బొట్టు ముక్కంటి మూడవకన్నులా అగబడసాగింది. మెడలో వేసిన రత్నాలహారం మధ్యలో నాయకమణిగా ఉన్న పెద్ద ఇంద్రనీల మణి, ఈశ్వరుని కంఠంలోని హాలాహలపు నల్లని మచ్చలా కనబడేది, మెళ్ళోవేసిన హారాలు సర్పహారాలుగా కనబడుతున్నాయి.

అలా చిన్ని కృష్ణుడు శివునిలా కనబడుతున్నాడు అన్నారు. ఆ కాలపు వీరశైవ వీరవైష్ణవ భేదాలను పరిహరించిన విప్లవ కవి, ప్రజాకవి మన బమ్మెర పోతనామాత్యుల వారు.

10.1-298-క.

**ఆ పాపల విహరణములు**

**తీపులు పుట్టింప మరగి తేఁకువ లే కా**

**గోపాలసతులు మక్కువ**

**నే పనులును మఱచి యుండి రీక్షణపరలై.**

**టీక:-** ఆ = ఆ; పాపల = శిశువుల; విహరణములున్ = క్రీడలు; తీపులు = ఆసక్తిని; పుట్టింపన్ = కలిగిస్తుండగ; మరగి = అలవాటు వలన ఆసక్తి పెరిగి; తేకువ = భయము; లేక =

లేకుండగ; ఆ = ఆ; గోపాల = యాదవ; సతులున్ = స్త్రీలు; మక్కువన్ = ప్రీతివలన; ఏ = ఏ యొక్క; పనులును = కార్యక్రమములను; మఱచి = మరిచిపోయి; ఉండిరి = ఉండిపోయారు; ఈక్షణ = చూచుట యందు; పరలు = లగ్నమైనవారు; ఐ = అయ్యి.

<u>భావము</u>:- బలభద్ర కృష్ణుల బాల్యక్రీడలు ఆ మందలోని గోపికలకు మధుర మధురంగా కనిపిస్తున్నాయి. వారు ఆ మాధుర్యాన్ని మరిగి అన్ని పనులు మరచిపోయి, అదురు బెదురు లేకుండా ఆ క్రీడలనే మక్కువతో వీక్షిస్తు ఉండిపోయారు.

10.1-299-వ.

**ఆ సమయంబున బాలకుల తల్లులు గోఱ గోరు కొమ్ములు గల జంతువులవలన నేమఱక, జలదహనకంటకాదుల యెడ మోసపోక, బాలసంరక్షణంబు జేయుచు నుల్లంబుల మొల్లంబు లైన ప్రేమంబు లభిరామంబులు గా విహరించుచుండి రంత.**

<u>టీక</u>:- ఆ = ఆ; సమయంబునన్ = సమయమునందు; బాలకుల = పిల్లల; తల్లులు = తల్లులు; కోఱన్ = కోరలు గల; గోరు = గోర్లు గల; కొమ్ములు గల = కొమ్ములు గల; జంతువుల = ప్రాణుల; వలనన్ = నుండి; ఏమఱక = ప్రమత్తులు కాకుండ; జల = నీరు; దహన = అగ్ని; కంటక = ముల్లు; ఆదులన్ = మున్నగువాని; ఎడన్ = అందుకొని; మోసపోక = ఏమరకుండ; బాల = పిల్లల; సంరక్షణంబు = పోషణ; చేయుచున్ = చేస్తూ; ఉల్లంబుల = హృదయములలో; మొల్లంబులు = అధికములు; ఐన = అయిన; ప్రేమంబులన్ = అభిమానములతో; అభిరామంబులుగా = మనోజ్ఞము లైనవి; కాన్ = అగునట్లు; విహరించుచుండిరి = క్రీడించుచుండిరి; అంతన్ = అప్పుడు.

<u>భావము</u>:- బలరామకృష్ణులు శైశవలీలలు ప్రదర్శిస్తున్న సమయంలో, వారి తల్లులు రోహిణి, యశోదలు చక్కని జాగ్రత్తలతో ఆ బాలురను పెంచుతు వచ్చారు. గోళ్ళు, కోరలు, కొమ్ములు ఉన్న జంతువులనుండి; నీళ్ళు, నిప్పు, ముళ్ళు మొదలైన వానినుండి ప్రమాదాలు జరగకుండ జాగ్రత్త పడ్డారు. హృదయాలలో బాలకుల యెడ ప్రేమానురాగాలు ఉప్పొంగుతు ఉండగా ఆనందంగా కాలం గడుపుతున్నారు.

10.1-300-క.

**తన యీడు గోపబాలురు**

**తనుఁ గొలువఁగ రాముఁ గూడి తనువు గలుగుచుం**

**దను గమనంబులఁ గృష్ణుఁడు**

**తనుమధ్యలు మెచ్చ నీల తనురుచి మెఱసెన్.**

**టీక:-** తన = తన; ఈడు = వయసు; గోప = యాదవ; బాలురు = పిల్లలు; తనున్ = అతనిని; కొలువగన్ = సేవించుచుండగా; రామున్ = బలరాముని; కూడి = తోకలిసి; తనువున్ = మంచిదేహము; కలుగుచున్ = ఉండి; తను = చిన్న; గమనంబులన్ = నడకలతో; కృష్ణుడు = కృష్ణుడు; తనుమధ్యలు = పడతులు {తనుమధ్యలు - సన్నని నడుము కలవారు, స్త్రీలు}; మెచ్చన్ = మెచ్చుకొనునట్లుగా; నీల = నల్లని; తను = శరీరపు; రుచిన్ = రంగుతో; మెఱసెన్ = చక్కగ నుండెను.

**భావము:-** బాలకృష్ణుడు అన్న బలరామునితో చిన్నచిన్న అడుగులు వేస్తూ ఆడుకుంటు ఉంటే, తన యీడు గల గొల్లపిల్లవాళ్ళు అతని చుట్టూ చేరి ఆడుకునేవారు. అతడే తమ నాయకుడు అన్నట్లు భక్తితో ప్రేమతో ప్రవర్తించేవారు. చల్లని వర్తనలు చూసి మందలోని మగువలు చూసి మెచ్చుకునే అతని నీల దేహకాంతి మెరుస్తున్నది.

10.1-301-వ.

**మఱియు నా కుమారుండు దినదినంబునకు సంచార సంభాషణ దక్షుండై.**

**టీక:-** మఱియున్ = ఇంకను; కుమారుండు = పిల్లవాడు; దినదినంబున్ = రోజురోజు; కున్ = కి; సంచార = విహరించుటలు; సంభాషణ = మాట్లాడుట; దక్షుండు = వచ్చినవాడు; ఐ = అయ్యి.

**భావము:-** ఆ కృష్ణ బాలకుడు రోజురోజు నడవటం, మాట్లాడటం వంటి కొత్త విద్యలు చక్కగా నేర్చుకున్నాడు.

10.1-302-ఉ.

చప్పుడు చేయకుండు మని జంకె యొనర్చిన నల్గిపోవఁగా
నప్పుడు బార చాఁచి తన యర్మిలి విందులు వచ్చి రంచు న
వ్వొప్పఁగఁ జీరు తల్లి దెస కొత్తిలి కృష్ణుఁడు రంతు జేయుచు
న్నెప్పటియట్ల చన్గుడుచు నింపొలయన్ మొలగంట మ్రోయఁగన్.

టీక:- చప్పుడు = అల్లరి శబ్దములు; చేయక = చేయకుండా; ఉండుము = ఉండు; అని = అని; జంకె = బెదిరించుట; ఒనర్చినన్ = చేసినచో; అల్గి = అలిగి; పోవగాన్ = వెళ్ళిపోయి; అప్పుడు = అప్పటి కప్పుడే; బారచాచి = చేతులు నిడుపుగా చాపి; తన = అతని యొక్క; అర్మిలి = ప్రియ; విందులు = చెలికాళ్ళు; వచ్చిరి = వచ్చారు; అంచున్ = అనుచు; నవ్వొప్పగన్ = నవ్వొచ్చేటట్లుగ; చీరు = పిలుచు; తల్లి = తల్లి; దెసన్ = వైపున; కున్ = కు; ఒత్తిలి = గట్టిగా; కృష్ణుడు = కృష్ణుడు; రంతు జేయుచున్ = ఏడుస్తూ; ఎప్పటియట్ల = ఎప్పటిలాగనే; చన్నున్ = చనుబాలు; కుడుచున్ = తాగును; నింపు = చక్కదనము; ఒలయన్ = ఒలకబోస్తూ; మొలగంట = మొలకు కట్టిన చిరుగంట; మ్రోయగన్ = శబ్దము చేయగా.

భావము:- ఆ కృష్ణ బాలకుడు రోజురోజు నడవటం, మాట్లాడటం వంటి కొత్త విద్యలు చక్కగా నేర్చుకున్నాడు. తల్లి యశోద అల్లరి చేయవద్దని బెదిరిస్తే, కొంటె కృష్ణుడు కోపగించి దూరంగా వెళ్ళిపోతాడు. అది చూసి “నా కన్నతండ్రి! రా ప్రియ చెలికాళ్ళు వచ్చారు” అంటు చేతులు చాపి పిలవగానే పరిగెత్తుకుంటు తల్లి దగ్గరకు వచ్చి అల్లరి చేస్తూ ఎప్పటిలాగా చనుబాలు త్రాగుతాడు. అలా అల్లరి చేస్తూ పరుగెడుతుంటే, మొలతాడుకు కట్టిన చిరుగంట ఘల్లుఘల్లున మ్రోగుతుంది. ఆ అల్లరి ఎంతో అందంగా ఉంటుంది.

10.1-303-క.

**వల్లవగృహ నవనీతము**

**లెల్లను భక్షించి వచ్చి, యెఱుఁగని భంగిం**

**దల్లిఁ గదిసి చిట్టాడుచు,**

**నల్లనఁ జను "బువ్వఁ బెట్టు మవ్వా!"యనుచున్.**

**టీక**:- వల్లవ = గోపికా; గృహంబున్ = ఇండ్లలోని; నవనీతములు = వెన్నలు; ఎల్లను = అన్నిటిని; భక్షించి = తినివేసి; వచ్చి = వచ్చి; ఎఱుగని = ఏమీ తెలియనివాని; భంగిన్ = వలె; తల్లిన్ = తల్లిని; కదిసి = చేరి; చిట్టాడుచున్ = ఇటునటు తిరుగుచు; అల్లనన్ = మెల్లిగా; చనున్ = వెళ్ళును; బువ్వ = అన్నము; పెట్టుము = పెట్టు; అవ్వా = అమ్మా; అనుచున్ = అంటూ.

**భావము**:- గోపికల ఇళ్ళల్లో వెన్నంతా తిని యింటికి వచ్చి, అల్లరి కృష్ణుడు ఏమీ తెలియనివానిలా మెల్లిగా తల్లి పక్కకి చేరతాడు. "అమ్మా బువ్వ పెట్టు"అంటు ఊరికే ఇల్లంతా తిరిగేస్తాడు.

10.1-304-వ.

**మఱియు గోపకుమారులం గూడికొని కృష్ణుండు.**

**టీక**:- మఱియున్ = ఇంకను; గోపకుమారులన్ = గొల్లపిల్లలను; కూడికొని = కలుపుకొని; కృష్ణుండు = కృష్ణుడు.

**భావము**:- మరి కృష్ణబాలుడు గోపబాలురు అందరితో కలిసి, రకరకాల ఆటలు ఆడసాగాడు.

10.1-305-సీ.

"గోవల్లభుఁడ నేను; గోవులు మీ"రని-

వడి అంకె పైచుచు వంగి యాడు;

"రాజు నే; భటులు మీరలు రండురం"డని-

ప్రాభవంబునఁ బెక్కు పనులుపనుచు;

"నేఁదస్కరుండ; మీరింటివా"రని నిద్ర-

పుచ్చి సొమ్ములు గొనిపోయి డాఁగు;

"నే సూత్రధారి; మీ రిందఱు బహురూపు"-

లని చెలంగుచు నాటలాడఁ బెట్టు;

10.1-305.1-తే.

మూల లుఱుకును; డాఁగిలిమూఁత లాడు;

నుయ్యలల నూఁగుఁ జేబంతు లొనరపైచు;

జార చోరుల జాడలఁ జాల నిగుడు;

శౌరి బాలురతో నాడు సమయమందు.

**టీక:-** గోవల్లభుండన్ = ఆంబోతును, ఎద్దును; నేను = నేను; గోవులు = ఆవులు; మీరు = మీ రందరు; అని = అని; వడిన్ = వేగముగ; అంకె = ఎద్దు, ఆంబోతు అరుపు యందలి ధ్వన్యనుకరణ అంకె; పైచుచున్ = వేస్తూ; వంగి = ఎద్దు వలె వంగి; ఆడున్ = ఆటలాడును; రాజున్ = రాజును; నేన్ = నేను; భటులు = సేవకులు; మీరలు = మీరు; రండురండు = తొందరగా రండి; అని = అని; ప్రాభవంబునన్ = అధికార పూర్వకముగా; పెక్కు = అనేకమైన; పనులున్ = పనులను; పనుచున్ = అప్పజెప్పును; నేన్ = నేను; తస్కరుండన్ = దొంగను; మీరున్ = మీరు; ఇంటివారు = గృహస్థులు; అని = అని; నిద్ర = నిద్ర; పుచ్చి = పోవునట్లు చేసి; సొమ్ములున్ = ఆభరణములు; కొనిపోయి = తీసుకెళ్ళి; డాగున్ = దాగుకొనును; నేన్ = నేను; సూత్రధారి = దారముల బట్టి తిప్పువాడు, నాటకానికి దర్శకుడను; మీరు = మీరు; అందఱున్ =

అందరు; బహురూపులు = అనేక రూపముల బొమ్మలు, వివిధ వేషధారులు; అని = అని; చెలంగుచున్ = చెలరేగుచు; ఆటలాడబెట్టున్ = ఆట్లాడునట్లు చేయును.
మూలలున్ = సందుగొందుల లోకి; ఉఱుకును = పరుగెత్తును; డాగిలిమూతలు = దాగుడుమూతల ఆటలు; ఆడును = ఆడును; ఉయ్యలలన్ = ఉయ్యాలలు; ఊగున్ = ఊగును; చే = చేతిలోని; బంతులున్ = బంతులను; ఒనరన్ = చక్కగా; వైచున్ = వేయును; జార = విటుల; చోరుల = దొంగల; జాడలన్ = వలె; చాలన్ = విరివిగా, మిక్కిలి; నిగుడున్ = వ్యాపించును; శౌరి = కృష్ణుడు {శౌరి - శూరుని వంశపు వాడు, కృష్ణుడు}; బాలుర = పిల్లల; తోన్ = తోటి; ఆడు = ఆడెడి; సమయమందు = వేళ.

<u>భావము</u>:- ‘‘నేను ఆబోతును, మీరందరు ఆవులు” అంటు, ఆబోతులా రంకలు వేస్తూ పరుగుపెడతాడు. నేను రాజును, ‘‘మీరు అందరు నా భటులు” అంటు, అధికారం చూపుతు వాళ్ళతో ఎన్నో పనులు చెప్పి చేయిస్తాడు. “నేను దొంగను మీరు గృహస్థులు” అంటు వారిని నిద్రపుచ్చి, వారి వస్తువులు తీసుకొని పారిపోయి దాక్కుంటాడు. “మీరందరు నాటకాలలో పాత్రధారులు, నేను దర్శకత్వం చేసే సూత్రధారుడను” “నేను తోలుబొమ్మ లాడించే వాడిని, మీరు రకరకాల పాత్రల ధరించే తోలు బొమ్మలు” అంటు వారందరి చేత ఆటలు ఆడిస్తు ఉంటాడు. మూలమూలలోను దూరుతు ఉంటాడు దాగుడుమూతలు ఆడతాడు. ఉయ్యాలలు ఊగుతాడు. చేతిబంతులు ఎగరేసి ఆడుతుంటాడు. తిరుగుబోతులా, దొంగలా రకరకాల వోకిళ్ళు వోతాడు.

## నుతి

### 10.1-1791-మాలి.

<u>స</u>రసిజనిభ హస్తా! <u>స</u>ర్వలోక ప్రశస్తా!
<u>ని</u>రుపమ శుభమూర్తీ! <u>ని</u>ర్మలారూఢ కీర్తీ!
<u>ప</u>రహృదయ విదారీ! <u>భ</u>క్తలోకోపకారీ!
<u>గు</u>రు బుధజన తోషీ! <u>ఘో</u>రదైతేయ శోషీ!

<u>టీక</u>:- సరసిజనిభహస్తా = శ్రీరామా {సరసిజనిభహస్తుడు - సరసిజ (పద్మము) నిభ (వంటి) హస్తుడు (అరచేతులు కలవాడు), శ్రీరాముడు}; సర్వలోకప్రశస్తా = శ్రీరామా {సర్వలోకప్రశస్తుడు

- సర్వ (సమస్తమైన) లోక (లోకములలోను) ప్రశస్తుడు (శ్లాఘింపబడువాడు), శ్రీరాముడు}; నిరుపమశుభమూర్తీ = శ్రీరామా {నిరుపమశుభమూర్తి - నిరుపమ (సాటిలేని) శుభ (మేళ్ళు కలిగించెడి) మూర్తి (ఆకృతి కలవాడు), శ్రీరాముడు}; నిర్మలారూఢకీర్తీ = శ్రీరామా {నిర్మలారూఢకీర్తి - నిర్మల (పరిశుద్ధమైన) ఆరూఢ (నిలకడైన) కీర్తి (కీర్తి కలవాడు), శ్రీరాముడు}; పరహృదయవిదారీ = శ్రీరామా {పరహృదయవిదారి - పర (విరోధుల) హృదయ (గుండెలను) విదారి (చీల్చెడి వాడు), శ్రీరాముడు}; భక్తలోకోపకారీ = శ్రీరామా {భక్తలోకోపకారి - భక్తులను లోక (ఎల్లరకు) ఉపకారి (ఉపకారము చేయువాడు), శ్రీరాముడు}; గురుబుధజనతోషీ = శ్రీరామా {గురుబుధజనతోషి - గురు (గొప్ప) బుధ (జ్ఞానము కల) జన (వారికి) తోషి (సంతోషము కలిగించు వాడు), శ్రీరాముడు}; ఘోరదైతేయశోషీ = శ్రీరామా {ఘోరదైతేయశోషి - ఘోర (క్రూరమైన) దైతేయ (రాక్షసులను) శోషి (నశింపజేయు వాడు), శ్రీరాముడు}.

<u>భావము</u>:- పద్మాల వంటి హస్తములు కలవాడా! ఎల్లలోకాలలోను శ్రేష్ఠతమమైన వాడా! సాటిలేని మంగళ స్వరూపము కలవాడా! స్వచ్ఛమైన వన్నెకెక్కిన కీర్తి కలవాడా! శత్రువుల గుండెలను ఖండించు వాడా! భక్త సమూహానికి మేలు చేయువాడా! పెద్దలను, పండితులను సంతోషపరచేవాడా! భయంకరులైన రక్కసులను నాశనము చేయువాడా! శ్రీరామచంద్రప్రభూ! వందనములు.

10.1-1792-గ.

ఇది శ్రీ పరమేశ్వర కరుణాకలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజపాండిత్య పోతనామాత్య ప్రణీతం బయిన శ్రీమహాభాగతం బను మహాపురాణ దశమ స్కంధం బందంలి నంద పుత్రోత్సవంబును; బూతనా సంహారంబును; శకట భంజనంబును; దృణావర్తు మరణంబును; గ ర్గాగమనంబును; నారాయణాది నామ నిర్దేశంబును; బాలక్రీడయును; మృ ద్భక్షణంబును; వాసుదేవ వదనగహ్వార విలోక్యమా నాఖిల లో కాలోకనంబును; నవనీత చౌర్యంబు ననెడి కథలు కలిగిన “శ్రీ కృష్ణలీలలు -1” సమాప్తము అగుట.



***ఓం నమో భగవతే వాసుదేవాయ!!***

***ఓం! ఓం! ఓం!***

***ఓం! శాంతిః! శాంతిః! శాంతిః!***

***సర్వే జనా స్సుఖినో భవతు!!***

---